# సుకృతవిజయము.

ఇది

కాకినాడవాస్తవ్యులు,

సాహిత్యవిశారద,

కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారి:

విరచింపఁబడి, ప్రచురింపఁబడినది.

ప్రథమముద్రణము 1,000 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1936.



[వెల **0—6—0.**

# ఉపోద్ఘాతము.

ముప్పదినాల్గు వత్సరములు శ్రీ పీఠికాపుర రాజావారి కళాశాలలోఁ బ్రధానసంస్కృతపండితులుగా నుండి, సాహిత్య విశారదులని, విఖ్యాతిఁగాంచిన, బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్య శాస్త్రిగారు రచించిన, "సుకృతవిజయము" నామూలాగ్ర ముగఁ జదివి, ఆనందాబ్ధి నోలలాడితిని. భారతదేశము యుగ యుగములనుండియుఁ, బరమార్థరహస్యసిద్ధులైన, బ్రహ్మర్షివరే ణ్యుల పవిత్రప్రవర్తన ప్రబోధములచే లోకారాధ్యమై వెల యుచువచ్చినది.

మఱియు నిభూమండలమున దేవతలవలె లోకకల్యాణ మునకొఱకై సంపూర్ణత్యాగములొనర్చిన భూసురశ్రేష్ఠుల తపః శక్తియే భారతధర్మమను గుండెకాయకుఁ బరిశుద్ధరక్తప్రసార మొసంగియున్న సంగతి లోకవిదితము.

స్వభావసుందరములగు వర్ణనములతోడను, ఘనాశయ హృద్యములగు ప్రబోధములతోడను, అక్లేశావగాహనరమ్య ములగు రసములతోడను, కూడి పాఠకహృదయముల సద్భావ వము లుదయింపఁజేయునదియే కవిత్వము. శ్రీ శాస్త్రిగారి కవితలో నట్టిరచనాపాటవము స్ఫుటమగుచుండును.

ఈ కావ్యమున భూసురపుంగవుఁడగు సుకృతుఁడును, పతివ్రతాశిరోమణి యగు నావిప్రుని యర్ధాంగి మీనాక్షియు, గృహస్థ ధర్మాచరణములోఁ జూపిన త్యాగ సౌశీల్యాదులను

శ్రీ శాస్త్రిగారు మృదుమధుర శైలిలో బాలురకుఁగూడ సుబోధ మగునట్లు చక్కని యుపమానములతో రచించినారు. ఈవిప్ర కుటుంబములోని వ్యక్తు లొక్కొకరాజము కష్టముదీర్పఁ దమ ప్రాణములను బలియొసంగ సంసిద్ధులై "త్యాగే నైకే అమృతత్వమానశుః" అను శ్రుతివాక్యబోధలను తమ జీవితములలో వ్యక్తముచేసిరి.

ఏ జాతియైన నున్నతదశనొంది, సర్వసద్గుణాలక్షితమై విరాజిల్లవలెనన్న, ఆజాతిలోని యువతీయువకులు తమ జాతిధర్మముల నిరూపించు గ్రంథముల నాదరముతోఁ జదువు టత్యవసరమని చెప్పనక్కఅలేదు.

స్వధర్మ ప్రబోధములతో నిండి నిబిడీకృతమైయున్న, యీ సుకృతవిజయమును రచించి, శ్రీశాస్త్రిగా రాంధ్రలోకమునకు మహోపకార మొనర్చినారనుటలో నతిశయోక్తి లేదు. విద్యాశాఖాధికారు లీ సద్గ్రంథమును ఉన్నతపాఠశాలలలోఁ బఠనీయగ్రంథముగా నేర్పరచినచోఁ దమవిధిని నెఱవేర్చినవారగుదురు.

శ్రీ శాస్త్రిగారింకను నిట్టి యుద్గ్రంథములఁ బెక్కింటిని రచియించి, ఆంధ్రసారస్వతసేవ యొనర్తురు గాక యని విన్నవించుచు, ఈ పరిచయవాక్యములను వ్రాయ నాకవకాశ మొసంగిన శ్రీ శాస్త్రిగారికిఁ గృతజ్ఞతావందనము లర్పించుచున్నాను.

ఇట్లు,

బులుసు వేంకటేశ్వర్లు, ఎం. ఏ.,

వివేకానంద, రామతీర్థ, హిందూమతాది గ్రంథకర్త

# నా న్ని క.

---

శ్లో॥ ప్రేమైవమానవోధర్మః ద్వేషః పశుగుణోమతః ।
అతః సర్వేషు భూతేషు దయాంకుర్వంతుమానవాః॥

ప్రేమయే యుత్తమమానవలక్షణము. ద్వేషము పశు చిహ్నము. ప్రేమ సంఘాభ్యుదయహేతువు. ద్వేషము సంఘ వినాశకారణము. ప్రేమలేనినాడు విద్యాధనాదిసంపద లెన్ని యున్నను లోకమునకు మేలు సమకూరనేరదు.

చందమామకుఁ జల్లదనము సహజగుణమైనట్లు ప్రేమ కుఁ ద్యాగము నైసర్గికస్వభావము. దేశమునకు గౌరవానంద ముల సమకూర్చువారిలోఁ ద్యాగశీలురు అగ్రగణ్యులు. వారి చరితములు పరమపావనములు. ఉత్సాహజనకములు. అభ్యుద యహేతువులు. కావున, దేశాభిమానులగు, సోదరులు త్యా గఘనుల జీవితముల శ్రద్ధతోఁ జదువవలయును.

మఱియుఁ, బ్రాచీనకాలములో మనదేశమున, గ్రామ ములయందలి జనసమూహమునఁ బ్రేమభాగ్యమును, త్యాగ దీప్తియు, నెంతఘనముగా విరాజిల్లుచుండెడివో ! తెలిసికొనుట కూడ నిజదేశహితాభిలాషులకు ముఖ్యకర్తవ్యము. అందునను,

గ్రామసంపదల నభివృద్ధిలోనికిఁ దేవలయుననెడి యభిలాష లుద యించిన యీకాలమున, పూర్వ మగ్రహారములలో స్వాభ్యాత్ర మెట్లుండెడిదో గమనించుటయు నవసరమే.

నే నిదివఱలోఁ బురాణముల నెన్ని, వన్నెకెక్కిన కొన్ని చిన్నికతల "విజయము" లను పేర రచించియుంటిని. వానిలో నీసుకృతవిజయ మొకటి. ఇందు గ్రామవైభవముజాతుర్వర్ణ్యమై త్రియుఁ, ద్యాగ గరిమయు, మృత్యుగ్రస్తుల కుయుక్తులు లోనగు నవి వర్ణితములై యున్నవి. అందుచే నీగ్రంథము సహృదయుల గు సోదరుల యాదరమునకుఁ బాత్రమగునని నా నమ్మిక.

ఓం తత్సత్,

కా శీ భ ట్ట సు బ్బ య్యా శా స్త్రి.



సాహిత్యవిశారద,

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

# అంకితము.



శ్లో॥ బ్రహ్మనధానినం నౌమి। వేదవేదాంగవేదినం।
కాశీభట్టాన్వయాంభోధేశ్చంద్రం మే జనకంసదా॥

సాంగాధ్యయన మొనర్చి, శ్రౌతస్మార్తకర్మకలాపముల నసమాన శేముషీకౌశలముతో స్వయముగ నడపి, దేవతార్చనాదిగార్హస్థ్యవిధులఁ జక్కఁగ నెఱపి, శ్రోత్రియావంతసులని ప్రతిభఁగాంచి, కీర్తిశేషులైన, మాతండ్రిగారికి, ఈసుకృతవిజయము వందనపురస్సరముగా నాచే నంకిత మొనర్పఁబడినది.

ఓం తత్సత్,

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.

# సుకృతవిజయము.



శ్లో॥ సుకృతాఖ్యాం నుమో నిత్యం భూసురంత్యాగభాసురం ।
యత్కథాశ్రవణా ల్లోకాః ప్రాప్నువంతిగుణోన్నతిం ॥

గోదావరీతీరమున కనతిదూరమునందు శ్రీగిరియను, భూసురాగ్రహార మొండుకలదు. ఆయగ్రహారమునకుఁ జూపు మేరదూర మెటుఁజూచినను కాంచనకణకణిశములట్లు పచ్చగాఁ జూపట్టు వెన్నులతోఁగూడి గాలిచే నొయ్యారముగ నూఁగాడు శాలిసస్యములు, కన్నులకింపుఁ గొలుపుచుండును. ఆవరిపైరులకుఁ జేరునను సద్వంశసంబంధముచే వక్రతలేక, తిన్నగానిలచియున్న చెఱకుతోటలు కాననగును. ఆయిక్షుక్షేత్రములు దాటినతోడనే శ్రీగిరినిఁజుట్టుకొని, నానావిధఫలతరుశోభితములును, వివిధసుమసౌరభసుందరములును, స్వాదురసకాసారభాసురములును నగు నారామములు చూడనగును.

పథికులాయగ్రహారములోనికిఁ బోవలయునన్న నాతోటలనడిమినుండియే వెడలవలయును. అట్లేగునపుడు పిల్లనగ్రోవులపై వల్లవీలోలుని లీలలఁ బాడుచు, నడుమనడుమ చెట్లక్రింద బడు చిలకకొట్టులనేరు గొల్లకుఱ్ఱలును, పనసల వల్లివేయుచుఁ గుల్యానీరములచేఁ బాదపాలవాలములఁ బూరించు భూసురకుమారులును, సతీచరితముల గానముసేయుచుఁ గుసుమాపచయ

మొనర్చు విప్రకన్యలును మహాన్యాసమంత్రములఁ బఠించుచు మారేడుదళములఁ ద్రుంచు ద్విజావతంసులును, పావనానురాగబంధురములగు సంబోధనములతో నన్యోన్యయోగక్షేమముల నరయుచు గాసారజలములఁ గలశములతోఁ గొంపోవు శ్రీగిరినారీమణులును, ఉదయాస్తమయసమయముల నావనసీమలఁ గానవత్తురు.

ఆతోఁపులు దాటినతోడనే కసవులచే మిసమిసలాడు పచ్చికబయళ్లు పాంథజనవిశ్రాంతికై పరుపఁబడిన ఆకుపచ్చతివాసులట్లు కాన్పించును. ఆబయళ్లయందు పాలతో నిండిన పొదుగులబరువుచే వడివడిగ నడువజాలక, నెమ్మదిగ నడయాడుచున్న పాడిమొదవులును; మంచుకొండలవలె నున్నతములుగ నున్న దుక్కిటెడ్ల మందలును, మదగజములనుగూడ మార్కొనఁజాలు మహిషయూథములును, నాయగ్రహారంపుసొమ్ములసొంపును దెలియఁజేయుచుండును.

బాటసారు లాయనుపమానానూపభూముల దాటి, యగ్రహారములోఁ బ్రవేశింపఁబోవునపుడు కూరపాదులతో నలరారుపాటిపెరళ్లు చూపట్టును. వానిం దాటినతోడనే, యాయూరి సంసారుల భావములట్లు వంకరలేక తిన్నగనున్న నున్ననిగ్రామ వీథులు కనఁబడును. వానియందుఁ బ్రవేశించి చూచినఁ గుడియెడమల నల్లరంగు లలఁది, అందుపై గచ్చకాయమెఱుఁగిడుటచే నల్లరాలవలె నలరారు వీథియరుగులసంటి క్రింద నెట్టజేగురు

పూతలును, ఆపైఁ దెల్లవెల్లవేతలునుగల ఇండ్లగోడలు సృష్టి హేతువగు త్రిగుణసమ్మేళనమును సూచించుచుండును. ఇంటిం టికిని, వీథిగుమ్మములకుముందు చక్కఁగాఁ జిత్రింపఁబడిన ము గ్గులు ముచ్చటఁగొలుపుచుండును. ఆయూరఁ బసుపురాసి కుం కుమపుపట్టీలుపెట్టనిగడప లగుపడవు.

అచటి యిండ్లచూరులకు వ్రేలాడఁగట్టఁబడిన వరికుచ్చు లపై వ్రాలి ఒండొంటితోఁ గలహింపక, కిచకిచలాడుచు, గింజ లనుదిను చిలుకలోనగు పిట్టలు చెలిమియే సుఖసాధనమని తెలు పుచుండును.

ఇట్లు క్రమముగాఁ బాదజోరుజబాహుజవీధులనుదాటి, ముఖజవాటికలోని కేగినచో వామదక్షిణముల సువిశాలవేది కాసుందరములగు ముఖాళిందములు చూపట్టును. ఆవీథిసావిళ్ల కును, లోనికాపురంపులోగిళ్లకును నడుమఁ గొంతవిశాలమగు స్థలముండును. ఆగృహాంగణముల కొకవైపున ధాన్యకోష్ఠము లును, వానికెదురుగా వేఱొకవైపున ధేనుగోష్ఠములును, కాన నగును.

లోపలికాపురపుటిరవుల కిరుగడల వెడల్పగు నరుగులుం డును. గురువు లిట వటువులకు జదువులఁ గఱపుచుందురు. లోని మనికిపట్టులకుఁ జేరువగాఁ ద్రేతాగ్నులచేఁ దేజరిల్లు హోమాగారములు వెలయుచుండును.

జను లాభూసురమందిరవీథులలో నడచునపు డొొక యింటినుండి వేదములును, ఇంక నొకగృహమునుండి వేదాంత ములును, మఱియొకయిరవునుండి శాస్త్రచర్చలును, ఇంకొొక సద్మమునుండి గానవిద్యావిలాసములును మఱొక యునికిపట్టు నుండి కవితాప్రశంసలును, వేఱొకభవనమునుండి చిత్రకళా ప్రసంగములును, ఇటుల సకలవిద్యలును శ్రుతిగోచరము లగు చుండును.

ఆయగ్రహారమున విద్యలనభ్యసించు బాలురన్ననో ! స్వదేశసౌభాగ్యసౌధనిర్మాణమునకు దృఢముగా వేయఁబడిన నల్లరాతిపునాదులట్లు చెక్కుచెదరని దేహబలసంపదలతో నొ ప్పుచు, స్వధర్మసేవ కడ్డుతగిలినచో భూధరరాజములనైనఁ బ్రక్కకు నెట్టఁజాలుదుమనెడి మనోనిబ్బరముకలవారై, విషయ వాంఛలనెడి విషవాయువులఁ బీల్పక, శమదమాదులనెడి సుమ సౌరభముల నాఘ్రాణించుచుందురు. సోదరస్నేహపూరితముల గుగుణదీపకాంతులచేఁ బ్రకాశించు ఆబాలురహృదయకోశ ముల నిలువఁజాలక, ద్వేషతిమిరములు పైకి వెడలిపోవుచున్న వో యనునట్లు తైలసంస్కారము లేక, పై కెగసియున్న నల్లని పంచశిఖలు వటుశిరములఁ జూపట్టుచుండును. పచ్చగోచులును, కృష్ణాజినములును, ముంజమేఖలలును, పలాశదండములును, యజ్ఞోపవీతములును, లోనగుచిహ్నములు సనాతనవిద్యార్థి వేషములఁ బ్రకటించుచుండును.

అచటి యంతేవాసులు కపటమెఱుంగనిమాటలచేతను, కీర్తనీయములగు ప్రవర్తనములచేతను, భక్తిపూతములగు చేతల చేతను గురుజనుల సంతసింపఁజేయుచు, విద్యల నభ్యసించు చుందురు.

ఇఁక నాయగ్రహారమున నివసించుభూసురోత్తములన్ననో, చీమమొదలు పరబ్రహ్మముదనుకఁ గల చేతనజాతమును, ఆత్మతుల్యముగా భావించి, ప్రేమించు దయాస్వరూపులు, కపటకృత్యములన్నఁ నెట్టివియో కలనైన నెఱుంగని సత్యవర్తనులు, నిత్య మన్నదానములచే బీదలనాదరింప నాసపడువదాన్యులు, తమ కెంతటి సిరియున్నను గర్వమును జెందక, వ్యసనములఁ జిక్కక, సత్కర్మానుష్ఠానములతోఁ గాలముగడుపు స్వభావముకలవారు.

ఆయగ్రహారనివాసులగు చాతుర్వర్ణ్యములవారును, కష్టసుఖముల నొక్కటిగాఁగూడి, అన్యోన్యసహాకార మొనర్చుకొనుచుందురు. ఆయూరివారి వర్ణక్రమము ఆరోహణావరోహణములకు, సోపానక్రమమువలెఁ బరస్పరసాహాయ్యకమై యుండును. కాలు, గన్నులులోనగు నవయవములు నామరూపవ్యవహారములయందు వేఱుగానున్నను, శరీరసంచారానుకూలములైనట్లు కాపు, బాపలు లోనగు కులములు సంఘకళ్యాణమునకుఁ దోడ్పడుచున్నవి కాని, సంఘవినాశనమునకు దారిఁజూపుట లేదు.

ఈశ్వరసృష్టిలో వస్తుగుణభేదములు సహజములు. అట్టి భేదములఁ బాటింపక, సోదరభావముతో మెలంగుటయే వివేక లక్షణము. దీనికే సమన్వయమని పేరు. ఈసమన్వయ మెఱింగిన వారి కన్వయభేదములు బాధకములు కాఁజాలవు.

అంతియకాని పేర్లనుబట్టియు, వృత్తులను పురస్కరించుకొనియు, హెచ్చుతగ్గుల నుగ్గడించుకొనుచు, విడిఁబడజూచుట అనాలోచితకృత్యము. ఒకదివ్యమందిరమును కనుఁడు. దాని కడుగుభాగమున పునాదులును, వానిపై గోడలును, ఆపైఁ గలపయు, దానిపైఁ బెంకులును, ఇట్లొకదానికొకటి ఆధారమైయుండి, ఆమందిరమును నివాసార్హముగాఁ జేయుచున్నవి. వీనిలోఁ బూర్వపూర్వము లుత్తరోత్తరములకంటె హీనములనికాని, ఉత్తరోత్తరములు పూర్వపూర్వములకంటె నుత్తమములని కాని, తలంపనగునా ? వీనినిఁ దారుమారుసేయ సాధ్యమగునా ? అటులనే సంఘసౌధనిర్మాణమునకు పాదజోరుజబాహుజముఖజవర్ణములు ప్రధానసాధనములు. ఈ ధర్మమెఱింగినసదాశయులకుఁ గులభేదములు సంఘానందసంధాయకములుగాఁ జూపట్టును కాని, సంఘనిర్మూలనకారణములుగఁ గన్పట్టవు. కావుననే సహృదయులగు నాయగ్రహారములోని కులములవారు సోదరభావముతో జీవించుచుండిరే కాని శత్రుత్వముచే మడయుట లేదు.

ఆయగ్రహారమునఁగల మఱియొకవిశేషమేమన; అచటి వారికి ధనముతో నంతగాఁ బనిలేదు. సౌహార్దమే సౌఖ్యసాధనము. ఆయూరి సంసారు లాహారాదిపదార్థముల సస్యవినిమయముచే సమకూర్చుకొందురు. పాత్రవస్త్రాదినిర్మాతలకు ధాన్యములఁగొల్చిన వారు కావలసినవస్తుసామగ్రి నొసంగుదురు. అటులనే రజకాదిసేవకులకు ధాన్యము లొసంగిన సేవచేయుచుందురు. అందుచే నట వస్తువిక్రయముకంటె సస్యవినిమయమే సౌఖ్యసాధనముగ నుండెను.

"నిజ మారయ పట్టణనివాసముకంటెఁ బల్లెటూరికాపురము సౌఖ్యావహము. నగరజనజీవనవాహిని వార్షికతరంగిణీప్రవాహమువలెఁ గలుషితమై, కూలమర్యాదాభంజకమై, జీవలోకభయావహమై, యల్లకల్లోలముగా నడచుచుండును. గ్రామజనజీవనమో, శారదనదీనీరమువలె నిర్మలమై, కులమర్యాదలకు లోనై, సుఖసంసేవ్యమై, శాంతముగా సాగుచుండును."

మఱియు నా యగ్రహారికులెల్లను సాయంసమయములఁ దమతమ వ్యాపారముల ముగించి, దేవాలయముల కేగి, యచట జరుగుచున్న పురాణకాలక్షేపముననో, హరినామ సంకీర్తనముననో కాలము గడపి, శాంతచిత్తులై దివ్యవిగ్రహముల సందర్శించి, యానందమగ్ను లగుచుందురు. "సత్యమే! మానవమానసములను శాంతపావనములనుగాఁ జేయుటకు దేవాలయములే ముఖ్యసాధనములు."

ఇఁక నాయగ్రహారమున త్రేతాగ్నికాంతికలితములగు యాగశాలలయందు హోతలు పఠించు ఋగ్వేదనినదములును, అధ్వర్యులుచ్చరించు యజుర్వేదరవములును, ఉద్గాతలొనర్చు సామగానస్వరములును, మిన్నుముట్టుచుండును. ఆపావనత్రయీనినాదము నాకర్ణించునపుడు, శ్రోతలు సంతోషపరవశులగుచుందురు.

“నిజమే ! వేదనాదమునఁగల పావనతయు, పరవశతయు, తదితరస్వనమునఁ గానరాదు.”

అట్టి యగ్రహారరాజమునకు నాయకుఁడును, సత్యమే యాత్మస్వరూప మనునమ్మిక కలవాఁడును, కరుణయే హృదయముగా నెంచువాఁడును, శీలమే సిరి యని తలంచువాఁడును, విద్యయే భూషణముగ భావించువాఁడును, త్యాగమే జీవితఫలమని యూహించువాఁడును, పెక్కేల ! సకలసుగుణరాశియనఁదగు సుకృతుఁ డనుపేరుగల భూసురోత్తముఁడు కలఁడు.

ఆవిప్రవరుఁడు తన కిరువదియేండ్లు వయసువచ్చువఱకును బ్రహ్మచర్యవ్రతపరాయణుఁడై 'విద్యలఁ జక్కఁగనేర్చి, అటుపిమ్మటఁ దా నొంటరిగనుంట సకలజీవులకును, క్షుత్పిపాసాదిబాధలఁ దొలఁగించి, తగునుపచారములచే సౌఖ్యముల సమకూర్చుటకు ననువుగామిని గుర్తించి, ప్రాణిసంరక్షణదక్షమగు గార్హస్థ్యమునఁ బ్రవేశింపనెంచి, కులరూపగుణోపేతయు, మీనాక్షినామధేయయు నగు నొకమహీసురకన్య నగ్ని

సాక్షికముగాఁ బరిగ్రహించి, ఆసాధ్వి తాఁ జేయు సత్కార్యములకు సహాయురాలు కా గృహస్థధర్మములఁ జక్కగ నెరపుచుండెను.

ఆయూరివారెల్లరును ఆపుడమిఱేనినుడువుల కడుగుదాటక, గడగడలాడుచుందురు. ఆతఁడు బాల్యము మొదలొకయార్తుఁడు తనకంటఁ బడినను, నొకదీననాదము చెవిసోకినను నింట నిలువఁజాలక యావెంటనే పరుగిడి యార్తులజేరి, వారికి సంప్రాప్తమైన కష్టముల నివారింప సకలప్రయత్నములు చేయుచుండెడివాఁడు. ఇట్లు కరుణార్ద్రహృదయుఁడగు నాశ్రోత్రియుఁడు పరసౌఖ్యమును సమకూర్పఁ గొన్నిదినములవఱకు నిజకర్మాచరణదీక్షను, స్వాహారగ్రహణమును గూడ సరకుసేయకుండుటయును కలదు.

ఈమహనీయుని కీలోకమున దీనజనసంరక్షణమును మించిన యాగమును, త్యాగమును మించిన సంపదయు, అహింసను మించిన ధర్మమును, కానరావు. ఇట్టివిప్రవరుఁడు శ్రౌతస్మార్తాది నిత్యనైమిత్తికకర్మల శ్రద్ధాభక్తులతో నాచరించుచు, నతిథ్యభ్యాగతులఁ బూజించుచు, విద్యార్థిబృందములకు వేదవేదాంగాది విద్యల బోధించుచు, పావనముగాఁ గాలమును గడపుచుండెను.

ఇట్లుండఁ గొంతకాలమున కీశ్వరానుగ్రహముచే నీద్విజమౌళికి కేశవ, నారాయణ, మాధవ, గోవిందులను

నామములు గల నలుగురు కొమరులును, రుక్మిణియను పుత్త్రి కయు నుద్భవించిరి. ఈద్విజకుమారులు క్రమముగఁ బెరిగి పెద్ద లై విద్దెల నేర్చుకొని జనకుని కానందమును కలిగించుచుండిరి.

ఇట్లాభూసురుఁడు, సుగుణాలంకృతయగు పత్నియు, విధేయులగు పుత్త్రులును, శీలవతియగు సుతయుఁ గొలువ హవిర్దానములచే దేవతలను, నన్నదానములచే భూదేవతాదులను, జలాంజలులచేఁ బితృదేవతలను సంతసింపఁజేయుచుండెను. లోకులెల్ల నాభూసురనాయకుని వేనోళ్లఁ గొనియాడుచుండిరి. ఆపుణ్యాపురుషునికీర్తి త్రిలోకముల వ్యాపించెను. ఎటఁజూచినను నాసుకృతుని త్యాగప్రశంసయే వినఁబడసాగెను.

ఇటులుండఁ ద్రిదివమున నమరేంద్రుఁడు దిక్పాలురతోడను వసువులతోడను మహర్షులతోడను తదితరవిబుధసంఘములతోడను నిండియున్న సుధర్మసభలోఁ గొలువుదీర్చియుండ, ప్రస్తావవశమున "నెవ్వఁడు సర్వోత్తముఁ"డను ప్రశంస రాగాఁ గశ్యపుఁడు బ్రహ్మచర్యవ్రతగరిష్ఠుఁడనియు, అత్రి ఏకపత్నీవ్రతుఁడనియు, భరద్వాజుఁడు విరాగియనియు, విశ్వామిత్రుఁడు సత్యరతుఁడనియు, గౌతముఁడు అహింసావ్రతుఁడనియు, వసిష్ఠుఁడు యోగనిష్ఠుఁడనియు, అంగిరసుఁడు హరినామసంకీర్తనపరుఁడనియు, జమదగ్ని పితృసేవాపరతంత్రుఁడనియు, పులస్త్యుఁడు దానలోలుఁడనియుఁ దెలిపిరి. అంత బృహస్పతి లేచి, "వీరెవ్వ

మను కాదు. ఎవఁడా_ర్తసంరక్షణమునకై నిజజీవితమును త్యాగ ముచేయునో ఆతఁడే సర్వోత్తముఁ"డని తెలిపెను.

అనుపై నింద్రుఁడు త్యాగశీలురలో ఘనుఁడెవ్వండని ప్రశ్నించెను. యముఁడు శిబియనియు, వరుణుఁడు దధీచియని యు, కుబేరుఁడు కర్ణుఁడనియు, అగ్ని నలుఁడనియు, తెలిపిరి. అంత నాశచీకాంతుఁడు "ఇపుడీకలికాలమున త్యాగశీలుఁ డెవ్వఁడైన భూవలయమునఁ గలఁడా?" అని ప్రశ్నింప నారదుఁ డిట్లు సమాధాన మిచ్చెను.

నారద—సురసార్వభౌమా! లేకేమి! నేఁటికి నిలాతల మున నా_ర్తజనసంరక్షణమునకై యమితానందముతో నసువుల నొసంగఁజాలు ధీరులు కలరు. అని సుకృతుని పూతజీవితమును సభాస్తారులెల్లరు నచ్చెరు వొందునట్లు వర్ణించెను. అమరేంద్రుఁ డాసురముని పలుకులు విని, కేవలస్వసుఖాభిలాషులగు కలిజ నులకుఁ ద్యాగసంపద యుండుటకు సందియమంది, స్వయముగ సుకృతుని త్యాగగరిమను పరీక్షింపఁగోరి, యొకవృద్ధకీరరూ పమును దాల్చి, సూర్యోదయసమయమున దర్భాసనాసీనుఁ డై గాయత్రీజప మొనర్చుచున్న యావిప్రోత్తమునిముందు "హాప్రాణేశ్వరీ!" అని సంబోధించి, నేలపైఁబడి కొట్టుకొన సాగెను.

మబ్బునందునుండి వెలువడిన రవికరప్రసారము మంచు గడ్డను గఱగించునటుల నాయా_ర్తకీరదీననాదము కర్ణపుటము

నంబడి మానసమును ద్రవింపఁజేయ నాభూసురుఁడు కన్నులు విప్పి చూచునరికి తనదర్భాసనమున కనతిదూరమున నేలంబడి కొట్టుకొనుచున్న యొకముసలిచిలుక కానవచ్చెను.

వెంటనే యాసుకృతుఁడు దానిచెంతకేగి మూర్ఛితమై నేలఁబడియున్న ఆజరఠకీరముయొక్క దుఃస్థితికి జాలిఁజెంది, పాత్రస్థమగు పూజాజలమును దానిపైఁ జల్లి, యాశుకమును లేవనెత్తి కృష్ణాజినముపైఁ బరుండఁబెట్టి యుత్తరీయముచే మెల్లగ విసరుచు,

"నేను గాయత్రీజపతత్పరుఁడనై యుండ "హాప్రాణేశ్వరీ!" అను దీనమానవకంఠస్వరము వినఁబడెను. కాని ఇట నార్తులగుమానవులెవ్వరు కానరాకున్నారు. ఇఁక నిట్లు పలికిన వారెవ్వరై యుందురు? ఒకవేళ దూరమునుండి యెవ్వరైన దుఃఖితులట్లు కేకవేసియుందురా ? లేక యీచిలుకయే యిట్టుల పలికియుండునా ?" అని వితర్కించుచుండ నాచిలుక మెల్లగఁ గనులువిప్పి, నీరుక్రమ్మియున్న చూపులచేతను, వెలవెలఁ బారియున్న ముఖముచేతను, గజగజవణకుచున్న దేహముచేతను దడదడఁ గొట్టికొనుచున్న గుండియలచేతను, తనకు సంభవించిన మహాదాపదను సూచించుచు "ఓకరుణామయా! యీశరణాగతునకభయమొసంగి, కాపాడుము."అని పలికి, తిరుగఁ గన్నులు మూసికొనెను. బ్రాహ్మణుఁడు చిలుకపలుకులకు వింతఁజెంది, దానిదీనభాషణములకు మనసు కరుగ దానింజూచి, యిటుల పలికెను.

"ఓకీరోత్తమా! నీ కభయ మొసంగితిని. నీ విట్లు భయ గ్రస్తుండవై పడియుండుటకుఁ గారణ మెయ్యది? నీయట్టిముదు సలికి బాధను కలిగించిన కఠినాత్ముఁ డెవ్వండు? వెంటనే తెలుపుము. నీకు సంభవమైన భయమును దీర్చుటకు సిద్ధము గనున్నవాఁడను" అన నాపక్షియుఁ గన్నులు విప్పి, యిటులఁ దెలుప మొదలిడెను.

చిలుక—ఓదయాసముద్రుఁడా! విప్రోత్తముఁడా! దాహాబాధచే నాప్రాణములు బోవునని తోఁచుచున్నది. కావున ముందు నాకుదాహోపశమన మొనర్పుఁడు. అటుపిమ్మట నాదీనోదంతమును నివేదించుకొందును. అన నాతఁడు పాత్రములో నున్న శీతలజలమును దోసిలియందుఁ బోసికొని, యావిహగము యొక్క చెంచుపుటమున కందీయ నదియు నాపానీయమును గ్రోలి, కొంత సేదదీరియుండుటను గాంచి, తిరుగ నాద్విజుఁ డిట్లు శుకమునుఁ బ్రశ్నించెను.

సుకృత—కీరరాజమా! నీముఖవైఖరిచూడఁ బిపాసాశాంతి యయ్యెనని తెలియవచ్చుచున్నది. కావున నిర్భయముగ నీకు వాటిల్లినయాపద యెయ్యదియో తెలుపుము.

చిలుక—ఓవిప్రకులావతంసా! నాకు సంప్రాప్తమైన యాపద సామాన్యమైనది కాదు. దానిని నివారించుట కెంతటి ధీరుఁడును వెనుదీయును. మీ రేదియెట్లయినను సరే నాకు సుఖ మొడగూర్తుమని శపథ మొనర్తురేని తెలిపికొందును. లేక

నావలను కాదందురా? వృథాగా నిటఁ గాలముగడుపక, వే ఱొక యార్తాభయప్రదాతను వెతకికొనియెదను. అన భూసురుఁ డాపక్షిపలుకులు తనవీనులకు ములుకులై తోప దీర్ఘ ని శ్శ్వాసమును విడచి, యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

సుకృత—ఓఖగపుంగవుఁడా ! ఆడినమాటఁదొప్పిన దీనులఁగాపాడఁ జాలక జీవించుటకంటె ప్రాణముల విడుచుట యే మేలు. దీనాలాపముల నాలించియు, పాషాణములవలె పడి యుండుటకంటె బధిరులగుటయే మేలు. ఆర్తజనోపచారము చేయ వెనుదీయువారి పూజలను, ప్రార్థనలను కరుణామయుఁ డగు పరమేశ్వరుఁ డంగీకరింపఁడు. పరిమళమకరందములు లేని కుసుమము మాడ్కి దయాసత్యములు లేని మానవజీవితము లోకపూజ్యము కానేరదు. గడ్డిగాదముల దినుపశువులుకూడ పరోపకారముల నెరపుచుండ షడ్రసోపేతముఁగ శాల్యన్నా దుల భుజించుమానవులు పరోపకారవిముఖులై స్వోదరపూ రణమాత్రపరాయణులగునెడ వారిని మించిన నింద్యజీవను లెంచను నుండఁబోరు.

ఓపక్షీంద్రమా! ఈ నాతుదిపలుకుల నాలింపుము. ఈవి ప్పుఁడు దారాపుత్రాదులనుగాని, శ్రౌతస్మార్తాదికర్మకలాప ములను గాని, స్వర్గాదిపరలోకసుఖములను గాని, తుదకుఁ బునరావృత్తిరహితమగు మోక్షానందమును గాని, యాడిన మాట చెల్లించుటకై నిర్లక్ష్యముగా విడుచునే కాని పాటిసేయు

వాఁడు కాడఁని విశ్వసింపుము. నీవు నామాటల నమ్మక, నన్ను విడచి, వేరొక్కని శరణుజొచ్చుటకుఁ బోదువేని యావెంటనే నాప్రాణములును, ఆర్తులఁ గాపాడఁజాలని యీనానింద్యదేహమును విడచి, పైకిఁ బోవుటయు నిశ్చయము. దాన నీకు బ్రహ్మహత్యాపాతకము తప్పక సంప్రాప్తమగును. నే నీవాక్కుల త్రికరణశుద్ధితో నుడువుచున్న సంగతిని దెలిసికొనుము. అన కీరరూపియగు సురేంద్రుఁ డాభూసురేంద్రుని గంభీరభాషణములకు లోనచ్చెరువంది, యావిప్రునిఁ జూచి, యిట్లు సంభాషింపఁ దొడఁగెను.

చిలుక:—ఓదీనశరణ్యా! ద్విజవరేణ్యా! నేను కోరఁ బోవునది సుదుర్లభపదార్థమగుటను, నాకు సంప్రాప్తమైన యాపద దుర్భరమగుటను చిత్తస్వాస్థ్యములేక మీరు నాప్రార్థనమును చెల్లింతురో! లేదో యని సంశయించి యిట్లంటిని. దూరమాలోచింపక, యజ్ఞానముచే నేజేసిన యపరాధమును క్షమింపుఁడు. ఆపదలం దెంతటివిద్వాంసులును మందబుద్ధులగుట లోకవిదితమేకదా! ఇటులుండ నాబోటితిర్యగ్జంతువుల బుద్ధిమాంద్యమునుగూర్చి తెలుపవలసిన దేమున్నది? ఇప్పట్టున నాకట్టిబుద్ధిజాడ్యమే లేకున్న శస్త్రపాణులును, నిరంకుశాధికారులును, ప్రతాపసింహులును, నగుచక్రవర్తులనుగూడ నిజధర్మబోధలచే నాడినమాటకుఁ గట్టుఁబడియుండునట్లుగాఁ జేయునంతటి మహిమలుగల మీయట్టి శ్రోత్రియశిఖామణు లాడినమాటల దా

కుచేతు రేమోయని, సంశయించుట యెట్లు పొసఁగును ? కావున నోపుడమివేల్పా ! అల్పబుద్ధినై యీప్రభావమును తెలియఁజాలక, నే నాడినమాటలకుఁ గోపింపకుఁడు.

సుకృత:—ఓచిలుకతోఁడా ! నీ వాడినమాటలకు నా మానసమునఁ గోప ముదయించుట లేదు. కాని నీకు సంభవమైన యాపదను తెలిసికొని వెంటనే దానికిఁదగు ప్రతిక్రియచేయ సంకల్ప ముదయించుచున్నది. నీ దుఃఖము తొలఁగించువఱకు నిహపరసుఖానుభవేచ్ఛ లెవ్వియు నామానసమున నంకురింప నేఱవు. కావున నీయార్తోదంత మెయ్యదియో ? జాగుసేయక తెల్పుము.

చిలుక:—ఓనిష్కలంకచరితా ! వినుఁ డీదీనునిచరిత్రమును. నేఁ గైశోరదశలోనుండఁగా నాతలిదండ్రు లొకనాఁడు గోదావరీనదీతీరముననున్న యొకజమ్మిచెట్టుపైని కట్టఁబడినగూటిలో నన్నుంచి, నా కాహారమును తెచ్చియిచ్చుటకు పైకిఁ బోయిరి. కాని వా రేవేఁటకానిబాణమునకో గురియగుటచే తిరుగ వారిని జూచుభాగ్యము దురదృష్టవంతుఁడనగు నాకుఁ గలుగదాయెను. నే వారికై సాయంతనసమయమువఱకు నిరీక్షించితిని. కాని కుహూవునకు రాకవలె వారిరాక నాకుఁ గానరాదయ్యెను. అపుడు నే నాఁకలిబాధకును, జననీజనకులకానరామికిని, తాళఁజాలక, కులాయమునుండి దీనముగాఁగూయఁ

దొడంగితిని. నే నెంతవిలపించినను నావిలాపమును వినువారు లేక నామొఱ యరణ్యరోదనమే యయ్యెను.

ఇట్లుండ మునికుమారులు కొందఱు సాయంకాలసంధ్యావందనమునకై వేదమంత్రముల స్వరయుక్తముగాఁ బఠించుచు, గోదావరీతీరమునకు నే నివసించియున్న శమీతరుసమీపముగాఁ బోవుచు గూటినుండి విలపించుచున్న నానీరసకూజితముల వినిరి. అంతట వారు తాము సేయుచున్న వేదగానమును మాని, నారోదనము నాలించుచు, నావైపు చూడసాగిరి. అపుడావటుసమూహములోనుండి యొక బ్రహ్మచారి శమీవృక్షము నెక్కి, మెల్లగ నే నున్న నీడమువైపు రాఁదొడంగెను. నే నెంతభయమందియున్నను రెక్కలు రానివాఁడనగుటఁ గూయఁదొడంగితినే కాని గూటినుండి యెగిరిపో నేరనైతిని.

ఆ విప్రకుమారుఁడు క్రమముగా నే నున్న నీడమును సమీపించి, యెగురలేక కుయ్యోయనుచుఁ గొట్టుకొనుచున్న నన్ను బట్టుకొని, క్రిందికి దిగి, తోడిబాలురకు నన్నుఁ జూపఁ, వారెల్లరు నన్నాదరముతోఁ జూచుచు, తమలోతా మేమియో సంభాషించుకొని, పిమ్మట నన్నొకశాటీవస్త్రముతో నిర్మింపఁబడినజోలి యందు భద్రముగా నుంచి, సంధ్యలవార్చినతోడనే మునిపల్లెకుఁ గొంపోయి, వెంటనే కొంచెము పాలతో నీవారాన్నకణములను పిసికి, ఆద్రవమును నాకుఁ బట్టిరి. ఆయన్నసారముచే నానీరసము తీరెను.

అటుపైని తమపెద్దలు చూడకుండ నన్నొక సమిధాగారమున వేత్రలతలతో స్వయముగా నల్లిన పంజరములో నుంచి, ప్రతిదినమును రహస్యముగాఁ బురోడాశశకలములను, నీవారాన్న కబళములను, గోక్షీరములను, నా కొసంగుచు, "అక్కా, అమ్మా" అను విడిమాటలు మొదలు నేను స్వయముగా మానుషభాషణముల నన్నిఁటిని పలుకునంతటి ప్రజ్ఞకల దానినిగాఁ జేసిరి.

ఇటు లాభూసురకుమారులు మక్కువతో నొసఁగుచున్న పావనమధురాహారములచే దేహబలమును, వారిబోధల నాలించుటచే మనోబలమును, క్రమాభివృద్ధము లగుచుండఁ గొంతకాలమునకు స్వపక్షబలపరిపూర్ణుఁడనై, బాల్యమునుగడపి, యౌవనమున నుల్లాసముగానుంటిని. ఇట్టుల కాలము సాగుచుండ నొక నాఁడాశ్రమబిడాల మొకటి నేనున్నపంజరమువైపు రాఁదొడఁగెను. దానిఁజూచినతోడనే యిది విరోధనిరోధకమును, సౌహార్ద ప్రవర్ధకమును నగు శాంతపావనతపోవనభూమి యనెడుమాటను మఱచి, శుకములకు సహజవిరోధియగు మార్జాలము నన్ను చంపునేమో! యనుభయముచే "మునికుమారులారా! మునికుమారులారా! రండు రండు. పిల్లి, పిల్లి, కాపాడుఁడు." అని బిగ్గరగానఱవ మొదలిడితిని. అపుడాశాలలోనికి సమిధలకై వచ్చియున్న వృద్ధతాపసియొకఁడు నాయాక్రందనమును విని, "ఇది యేమి సమిధాగారమున కీరనాదము విననయ్యెడి" నని, వెదకి

కొనుచు తిన్నగ నేనున్న పంజరము సమీపించి, అందుఁగూత లిడుచున్న నన్నుఁ జూచి, పంజరసహితముగ గదియూడి వెలుపలికి దెచ్చి, మునికుమారుల రాఁబిలచి, "బిడ్డలారా! దీని నెవ్వరు తెచ్చియుంచి"రని యడిగెను. అనృతభీతులగు నావటువులు నన్నుఁ జూచి, జాలి చెందినది మొదలు నేఁటివఱకును జరిగిన వృత్తాంతమునంతను నివేదించిరి. ఆ తపసియు వారి యవ్యాజ భూతానుకంపనుఁ బ్రశంసించి, యిట్లు బోధించెను.

తపసి— కుమారులారా! మీ రీకీరము దీనస్థితియందుండ దయతోఁ దెచ్చి, పెంచినందుకు సంతోషమే. కాని, యిప్పుడీ చిలుక పరసహాయ మపేక్షించు బాల్యమును గడపి, స్వతంత్ర జీవనార్హమగు యౌవనమున నున్నయది. కావున, దీని స్వేచ్ఛా విహారసుఖమును నిరోధించి, యిటులఁ బంజరమున బాధించి యుంచుట యహింసయే పరమధర్మముగాఁగల మునిపుత్త్రులకు న్యాయ్యము కాదు. కావున, నీకీరమును విడిచిపెట్టుఁడు. అన మునికుమారులును "చిత్త" మని వెంటనే నన్ను పంజరమునుండి వదలివేసిరి.

అంత నే పంజరబంధముక్తుఁడనై, స్వేచ్ఛగా వింధ్యాటవి నంతను తిరిగితిని. ఇటులఁ గొంతకాల మెచ్చటను నిలయమేర్పరచుకొనక, తిరిగి తిరిగి, యెచటనైన నొకనీడము నేర్పాటు జేసికొనఁ దలఁచి, నిష్ప్రత్యూహవాసయోగ్యమగు తా వెచ్చటదొరకునా! యని వెదకికొనుచు, పోయిపోయి, తుదకు వింధ్య

పర్వతాగ్రమున విశాలమగు నొక యున్నత సాలవృక్షమును గనుంగొంటిని.

అందు మాజాతిపక్షు లనేకములు గూళ్ళు కట్టుకొని నివసించుచుండుటను జూచి, నేను నొక శాఖాగ్రమునఁ గులాయమును నిర్మించుకొని, పగలంతయు నాహారార్థ మచ్చటచ్చట సంచరించి, సాయంకాల మగుసరికి గూటినిఁజేరి, రాత్రియందు నిదురించుచుఁ గాలము గడుపుచుంటిని. నే నాప్రాంతము ననివసించుచిలుకలన్నిఁటిలోను దేహమనోబలముల నధికుఁడనై యుండుటచే నచటిశుకములు తమకు నన్ను పాలకుఁడనుగా నుండుఁడని, ప్రార్థింపఁ దొడఁగినవి. నేను వానియందలి స్నేహభావముచే మాఱు పలుకనేఱక, వానియిష్టమును నెఱవేర్ప నంగీకరించితిని.

వెంటనే యాకీరములెల్ల సంఘీభవించి, యొక సుముహూర్తమున మహావైభవముతో శుకరాజ్యమునకు నన్ను బట్టాభిషిక్తునిఁగాఁ జేసి, అమితగౌరవముతో సేవింపఁదొడంగినవి. నేను వానినన్నిఁటిని సోదరభావముతోఁ జూచుచు, సముచితముగఁ గర్తవ్యములఁ గఱపుచు, మును నేమునిపల్లెను విన్న ధర్మముల బోధించుచు, మంత్రిసామంతాదిపరిజనపరివేష్టితుండనై యరువదియేండ్లు హాయిగాఁ గాలమును గడపితిని.

ఇటులుండఁ రాజభక్తులగు కీరనాయకులు కొందఱు నేను వివాహము లేక, యేకాకిగా నుండుటను జూచి, రాజవంశము

నభివృద్ధిచేయఁ గోరికకలవారై నన్ను వివాహ మాడుమని, సవినయముగఁ బ్రార్థింపఁ దొడఁగిరి. నే నందుల కంగీకరింపక, "నాకీముదివయసున ముదిత యేటికనియు, వివాహము చేయఁగోరుటయన బ్రహ్మచర్యమున నెట్టివ్యాకులతయు లేక, సుఖించుచున్నవానికంఠమున భార్యయనెడి బండరాతిని గట్టి, యగాధమగు సంసారసాగరమున ముంపఁజూచుటయే కాని వేఱొండు కాదనియు బహువిధముల బోధించితిని.

కాని యంతటితో నాకీరసంఘ మూరకొనక, మాటిమాటికి "పరిణయ మాడి, రాజవంశమును నిలువఁబెట్టుఁ"డని, ప్రార్థింపఁ దొడఁగినవి. "బుద్ధిః కర్మానుసారిణీ" అను నార్యోక్తిచేఁ దుదకు నేనును "అపుత్రస్య గతి ర్నాస్తి" యనెడి ధర్మవచనము స్మృతికి రాఁగా సంతతి లేకున్న నీపక్షిజన్మముకంటెను హీనమగు జన్మ మెత్తవలసివచ్చునేమో యనెడి భీతిచే విపత్తను భవింపవలసి యుండుటచే, వివాహమాడ నంగీకరించితిని. వెంటనే కీరనాయకులు సత్కులప్రసూతయగు నొక శుకయువతినిఁ గొనివచ్చి నాకు బరిణయముఁ జేసిరి.

ఆసాధ్వియు నన్ను ముసలివని నిరసింపక, దైవసమునిగ భావించి, భక్తితో సకలోపచారములఁ జేయుచు, నన్నారాధింపఁ దొడంగెను. నేనును నాశుకకాంతను బ్రాణసమముగఁ జూచుకొనుచుంటిని. ఇటు లన్యోన్యానురాగముతో మే ముభయులము కాలము గడుపుచుండఁ గొంతకాలమునకు నా

యర్ధాంగి గర్భవతియైనది. అంతట నా ప్రజలందఱు తమకు యువరా జుదయించునని, సంతసింపసాగిరి. "నిజమే ప్రాణు లేయభివృద్ధిలేకున్నను జీవింపఁగలరు కాని, పాలకకులాభివృద్ధిలేకున్న నానందింపఁజాలరుకదా! పిమ్మట కీరకాంతలు గర్భదోహదముల నెఱపుచుండ నాయిల్లాలు నవమాసములు నిండి, నేఁటికాఁపుదినముల క్రిందట సుఖప్రసవమైనది. కాని దుర్దైవము మాదంపతు లాశిశుముఖములఁ జూచి, యానందించుటకుఁ బూర్వమే యమితదుఃఖమును దెచ్చిపెట్టెను." అని పొంగివచ్చుచున్నవిచారమును బట్టఁజాలక, "హా ప్రాణేశ్వరీ! అబ నెట్లుంటివో కదా!" అని కన్నీరు విడువసాగెను. భూసురుఁడు కీరమునోదార్చుచు నిట్లుపలికెను.

సుకృత—కీరవరేణ్యా! ఇటుల విలపించుట ప్రాజ్ఞతాలక్షణము కాదు. ఆపదలందు ధైర్యముగా నుండుట వివేకలక్షణము. జాగుసేయక నీయుదంతమును పూర్తిసేయుము. నాప్రాణములనైన సమర్పించి, నీభయమును బారఁదోలుదును. అన నాకపటకీరము తిరుగ నిటులఁ బలుకఁ దొడఁగెను.

చిలుక—విప్రోత్తమా! ఏమని తెలుపుదును! నాఁటి భయంకరస్థితిని స్మరింప ప్రాణము లెగసిపోవుచున్నవి. వినుఁడు. నాయర్ధాంగి యండముల ప్రసవించినవెంటనే హఠాత్తుగావానతోఁ గలసి, యొక పెనుగాలి మహావేగముగా వీవసాగెను. ఆ ఝంఝామారుతముతాకుడువలన మహోన్నత మహీజ

హములుకూడ కూకటివేళ్లతోఁగదలి, గగనతలమున గడ్డిపరకల మాడ్కి తిరుగఁజొచ్చినవి. గిరితటములనుండి గండశిలలుకూడ తాటిపండ్లవలె క్రిందఁ బడఁజొచ్చినవి. నే నాగాలివానకు ఒక్క పెట్టున వృక్షాగ్రమునుండి తూలి, కొంతదూరమున నేలఁబడి తిని. ఆపాటునకు శరీరస్మృతి తొలఁగ నిశ్చేష్టుఁడనై, ఆరు దినములవఱకు ప్రాణహీనునివలె నేలఁబడి యుంటిని. పిమ్మట నేడవనాఁడు కొంచెమూపిరి చేరఁ గన్నులు విప్పి, చూచుసరికి వింధ్యపర్వతమునకుఁ గొన్నిక్రోశముల దూరములోఁ బడియు న్నటులఁ దెలిసికొంటిని. నాకు కొంచెము శక్తి రాగానే ప్రసూ తయగు నా కాంత యేమయ్యెనో!, ఆయుండము లేమాయెనో ! యని పట్టరానిఖేదముతో నటునిటు వెదకనారంభించితిని. విధి వశమున నాకు సమీపముననుండే నా భార్యయుఁ బడియుండు టను గాంచి, వెంటనే కొంతయుపచారమును జేయ నా బాలిం తరాలు మెల్లగఁ గన్నులు విప్పి, నన్నుఁ జూచి, గ్రుడ్లనుండి కన్నీరు కాలవలై పార "గ్రుడ్లేమయ్యె" నని, విలపింపసాగినది. అప్పట్టున నేను కొంతధైర్య మూని, "బాలింతరాల వగు నీవిట్లు కన్నీరు విడువరా"దని యూరడించి, లెమ్ము. నెమ్మదిగ గూటి కడ కేగి, గ్రుడ్లేమయ్యెనో కనుగొంద మంటిని.

కాని నాభార్య తాను చెందినప్రసవవేదనచేతను, మ హోన్నతమగు వింధ్యశిఖరమునుండి క్రిందఁ బడుటచేతను, నీరంధ్రములగు వర్షధారలచే దడియుటచేతను, డెక్కలను

కదుపనేరదాయెను. ఆసాధ్వియవస్థఁ జూచి నాతఁడు తీవ్రముగ గ్రమ్ముచున్నటులఁ దెలియవచ్చెను. విప్రవరా! ఆసమయమున నామనోవేదనము నేమని తెల్పుదును. అట్టిదారుణస్థితి నా గర్భశత్రువునకుఁగూడ కలుగకుండుఁగావుత! అప్పుడు నాయిల్లా లవసానదశయందున్నదని తెలిసికొని, ధైర్యము చెడ "బ్యారు" మని యొక్కపెట్టున విలపింపమొదలిడితిని. అప్పుడు మాకై వెదకుచున్న పరివారజనులు నారోదనధ్వని విని, పరుగిడి నాయొద్దకు వచ్చి, తమరాణియొక్క ప్రాణాపాయస్థితిని జూచి, నాకంటె పదిరెట్లధికముగ విలపింపసాగిరి.

ఆవ్యాకులసమయమున ధైర్యశాలియు, లోకానుభవజ్ఞుడును, నగు నామంత్రియొకఁడు నన్నుఁ జూచి, యిటులఁ బలికెను.

మంత్రి:—మహారాజా! ధైర్యసాగరులును, విజ్ఞాననిధులును, నగు నేలినవారిట్లు దుఃఖించుట న్యాయము కాదు. ప్రయోజనకారియుఁ గాదు. విపత్కాలమున ధైర్యత్యాగము తగదు. ఇట్టికష్టకాలమున కష్టముల దాటుటకు దగునుపాయముల నన్వేషింపవలయునే కాని దుఃఖోపహతప్రజ్ఞులై విచారింపఁ దగదు. కావున ధైర్యమూని, ప్రస్తుతకర్తవ్యము నాలోచింపుఁడు. అని బోధించి, పరిచారకజనుల "నే వచ్చువఱకు నీమహారాజ్ఞికి నెమ్మదిగ నుపచారములఁ జేయుచుండుఁ" డని, నియోగించి, వెంటనే యటనుండి వెగిరిపోయి, కొంత

వడికొకవైద్యునిఁదోడ్తెచ్చి, నాభార్యను చూపెను. అప్పుడావి హగవైద్యుఁడు నాప్రియురాలిని బరీక్షించి, యిట్లుఁ దెలిపెను.

వైద్యుఁడు :—ఓచిలుకలఱేఁడా! ఈశుకభామినికి నేదెల్పుచికిత్స చేసిన వెంటనే రోగనివృత్తి కాఁగలదు. ఈమె దేహమును మహాప్రసూతివాతము క్రమ్మియున్నది. అన నేనావైద్యునిఁజూచి, "ఓయాపద్బాంధవా! కీరకవివరేణ్యా! తడవుసేయక, శీఘ్రముగా మేము చేయఁదగినచికిత్స యేదియో తెలిపి, నాకు కళత్రదానముసంగి, నన్నీవిపత్సాగరమునుండి యుద్ధరింపుము. నాసతిని బ్రతికించితివేని నాయేలుబడిలో సగముపాలు నీ కొసంగుదును. లేదా ఈకీరరాజ్యమునకు నిన్నభిషిక్తునిగాఁ జేసి, నీకు మంత్రినై, నీచే రాజ్య మేలింతును." అని చేతులు జోడించి, వేడికొంటిని. నామాటలు విని, ఆవైద్యుఁడిట్లు తెలిపెను.

కీరసార్వభౌమా! నీకాంతకిప్పుడు భూసుర హృదయకోశమును దెచ్చి, యియ్యవలయును. బాపనగుండె నంజుఁడుచేఁ గాని, కీరాంగనల ప్రసూతివాతము నివర్తింపదు. మఱియేయితరౌష "ధనులవలనను ప్రయోజనము లేదు. మఱియు నీబాలింతను" నలువదినాలుగుగడియలలోపున మాంసమిచ్చిననే జీవించును. కాని ఆకాలము మించినపిదప నమృతమును దెచ్చి, ధన్వంతరి స్వయముగ నీపెకంఠమునఁ బోసినను, బ్రహ్మాదిదేవతలు "చిరంజీవినివి క"మ్మని, దీవించినను

ప్రయోజన ముండనేఱదు. కావున, జాగుసేయక, వేగముగా ద్విజహృదయమును దెచ్చి యీామె కీయవలయును.

ఆవైద్యునిమాటలు చెవినిఁ బడినతోడనే నారాణి మూసికొనిపోవుచున్న కన్నుల నతిప్రయత్నముచేఁ దెఱచి, తన కుఁగల జీవితాశ తెలియునటుల దీనమగుచూపుచు నావైపు ప్రసరింపఁజేసెను. ఓయార్తావనపరాయణా! తిరుగ నాప్రియు రాలి దీనావలోకన మిపుడు నాస్మృతికిఁ దట్టి, నాహృన్మర్మ ముల భేదించుచున్నది. "హాప్రేయసి" అని, కనులు మూసి యా కీరము విలపింపసాగెను. అపుడాద్విజవరుఁడు శుకము నూఱ డించి, యిట్లు పలికెను.

సుకృతి:—అయ్యా! విహగనాయకా! కరుణాకరుం డగు గరుడవాహనుఁడు నీయర్ధాంగి కెట్టివిపత్తును కలుగనీయఁ డు! త్వరితముగ నీచరితమును బూర్తిచేయుము. నీయుదంతము ను వినినకొలంది నాహృదయము నీరగుచున్నది. అనఁ దిరుగ నాకీర మిట్లు తెలుపనారంభించెను.

చిలుక:—ఓ పరదుఃఖదుఃఖితుఁడా! నావృత్తాంతము వినువారికే విచారమును కలిగించుచుండ నాస్థితి తెలుపవలె నా? నాకాంత నావైపట్లు చూచి, యిటులఁబలికెను. "ప్రాణే శ్వరా! క్రూరుఁడగుదైవము మనకిరువురకును నెడబాటొనర్పఁ గోరుచున్నటులఁ దోఁచుచున్నది. నాకు మన పిల్లలకు ఱెక్కలు వచ్చువఱకైన జీవించియుండవలెననెడిపేరాస కలుగుచున్నది.

కావున నీమహాశయుఁడు తెలిపినచొప్పున బావనగుండెనుదెచ్చి, నన్ను బ్రతికింపుఁడు. మీకు విప్రమాంస మెట్లులభ్యమగునా యను సంశయముతోఁ బనిలేదు. మనయీభరతవర్షము స్వదేశాభిమానముల నుత్సాహముతోఁ బత్తుల కొసంగి, వానిప్రాణములఁ గాపాడిన త్యాగధనుల కాకరమై వెలయుచున్నది. ఇప్పటికిని నిజదేశకీర్తిని నిలుపనోపు వీరవరేణ్యు లెందఱో యీయార్యావర్తమునఁ గలరు. కావున మీప్రయత్నము సఫలము కాఁగలదు. మీరాక కెదురుచూచుచు, నే నిట కంఠగతప్రాణనై, దైవమును ప్రార్థించుచుందును. అని దీనముగా వేడికొనెను.

ఆయార్తురాలిజాలిఁగొల్పుపలుకుల వినుటవలన దుఃఖమినుమడింపఁ గరుణామయుఁడగు భగవంతుని పరిపరివిధములఁ బ్రార్థించి, అట్టియార్తాభయప్రదాత యెచ్చట లభించునా! యని నే చింతించుచుండ నావైద్యుఁ డిటుల బోధించెను.

వైద్యుఁడు—శుకేంద్రా ! నీకాంతామణి తెలిపినటుల నిజదేహమాంస మొసంగి, నీయభీష్టమును దీర్పఁ జాలిన ధీరాగ్రేసరుఁడగు భూసురపుంగవుఁడు కలఁడు. అని మీపావనచారిత్రమును వివరించెను. నే నావైద్యునిమాటలు వినినతోడనే నాభార్యతో "పోయి వచ్చెదను విచారింపక, నార్తజనరక్షకుఁడగు భగవంతుని పావననామముల స్మరించుచుండు" మని, బోధించి, నే వచ్చువఱకు మీరాశని గాపాడుచుండుఁ" డని

మంత్రులకు నియమించి, యటనుండి యిటకొక్కయెగురునవచ్చి, దేవరవారిపాదపద్మములను గాంచగలిగితిని. ఇది నాదీనోపాఖ్యానము. ఇంతవఱకే నే నొనర్పఁదగినకృత్యము. ఇఁక జాగుసేయక, హృదయ మొసంగి, న న్నాపత్సముద్రము నుండి దరిచేర్చి, నిష్కళంకసత్యవ్రతమును ప్రకటించుట మీపని. అని, పలికి, యాచిలుక కన్నులుమూసి, దుఃఖాతిరేకమును నటింపసాగెను.

సుకృతుఁ డాచిలుకకోరిక కచ్చెరువంది, తనలో నిట్లు తలంపసాగెను. "ఓహో! ఈసుకనాయకుఁ డెంతటి భయంకర మగు కోరికను గోరెను! ఇపుడీతఁ డెట్టులైన విషయసుఖము లనుభవింపవలయు ననెడియుద్రేకభావము లుదయించుచున్నకాల మతిక్రమించి. విషయానందములు క్షణభంగురము లనియు, సతీసుతాదిబాంధవము దుఃఖహేతువే కాని సుఖదాయకము కాదనియు, అనుభవపూర్వకముగాఁ దెలిసికొని, వైరాగ్యకలితుఁడై, యహింసావ్రతసంపన్నుఁడై యుండవలసిన వార్ధకావసానదశయం దుండియు స్వార్థపరుఁడై బ్రాహ్మణమాంసముచే నిజకాంతను గాపాడఁజూచుచున్నాఁడు.

మూఢమానవులు జరామరణవర్జితులట్లు దారాపుత్రాదులకు సౌఖ్యముల సమకూర్చుటకై పరుల మోసగించియు, హింసించియు, యాచించియు మరెన్నియో పాపకార్యముల దైవభీతి లేక, నిర్లజ్జగాఁ జేయుచుందురు. ప్రాజ్ఞులన్ననో, జీవితము క్షణభంగుర మనియు, సిరులు మెఱపుతళుకులవంటి

వనియు, శరీరసౌష్ఠవము బుద్బుదతుల్య మనియు, విషయసుఖములు దుఃఖహేతువు లనియుఁ దలంచి, స్వార్థనిరభిలాషులై పరాభిలాషల సమకూర్పఁ బాటుపడుచుందురు. మఱియుఁ దాము చేయఁబూనిన పరహితములకు నిజసతీసుతాదులను గూడ సాధనములుగాఁ జేసికొందురే కాని, వారిపై మోహముచేఁ దా మొనర్పుసత్కార్యములను పరిత్యజింపరు. ఈత్యాగశీలురు స్వపరభేదమును వీడి, సకలచేతనసంఘమును నీశ్వరస్వరూపముగ భావించి, వినిర్మలభక్తితో సేవించుచుందురు.

అయ్యో! పాప మీదీనుఁడు తనభార్యను గ్రమ్మియున్న వాతరోగమును నివారింపఁ బ్రయత్నించుచున్నవాఁడే కాని, తనమానసమును నలమియున్న మోహాంధకారమును బాపికొనుటకు బ్రయత్నించుటలేదు. ఆహా! జీవు లెట్లు ఈషణత్రయ మనియెడి ముప్పేట త్రాటిచే సంసారవిషవృక్షమున కంటదీసి కట్టఁబడుచున్నారు? కట్టా! ఈరాగాంధుఁడు దారాపుత్రాదిసంరక్షణమునకై యుం దెందఱిప్రాణముల బలిగొననున్నవాఁడో కదా? అని చింతించుచున్న సుకృతు నుద్దేశించి, యాకపటకీర మిట్లు కన్నులెఱ్ఱజేసి, సంభాషింపఁ దొడఁగెను.

చిలుక—ఓపాపుఁడా! నాశోకకను విన్నవెంటనే మాఱాడక, చల్లితువని యనుకొంటిని. నీవుకు నటులనే నటించితివి. ఇపుడు నాదీనోదంతము నంతను విని, మౌనముద్రను వహించి, నీలో నీ వేదియో యోజించుచున్నటుల నగుపడు

చుంటివి. ఓద్విజుఁడా! మాంస మిచ్చుటకు జాఁకుచుంటివా? యేమి? లోఁగడ నీవు పలికినపెద్దసుద్దు లేమాయె? నీవు నా కోర్కె యెటులనెఱవేర్తునా! యని, తలపోయుచుంటివో! లేక మొగవేయుట యెటులనా! యని, యూహించుచుంటివో! తెలియకుంటిని.

కటకటా! దైవమా! ఆవైద్యుఁడు తెలిపినగడువు గడచిపోవుచున్నదే? నే నేమిసేతును! నాభార్య జీవించుట యెట్లు? ఓయీ! భూసురుఁడా!" హృదయ మొసంగుటకు నీకు శక్తి చాలకుండిన తెలుపుము. వేఱొకదాతను వెతకికొనియెదను." అని మొదటనే తెలిపియుంటినే!, అపుడేల యీమూకీభావమును జూపవైతివి? హా దైవమా! నాకు భార్యావియోగదుఃఖమును గలిగింపఁదలంచితివా? ఈపిఱికి బాపని కడకు నీవ్వుకొని వచ్చితివి? కటకటా! ప్రాణేశ్వరీ! నిన్ను తిరుగఁ జూచుభాగ్యము నాకు దూర మగుచున్నది. పాప మాపతివ్రత భూసురమాంసమును దెచ్చి తనకిచ్చి, బ్రతికింతు నని, పేరాసతో నట వేచియున్నది. ఇచ్చో! మాంస మొసంగి, కాపాడకుంటె మానె? అవసానకాలమున నాసాధ్వికడనుండి, చేతులార నుపచారములు చేయుభాగ్యముఁ గూడఁ బోగొట్టికొంటినే? ఔరా! ఆవైద్యుఁడు న న్నెంత మోసపుచ్చెను? ఈబ్రాహ్మణుఁ డడిగినవెంటనే నామనోరథ మీడేర్చునని బోధించెను.

నే నెంతటి వెఱ్ఱివాఁడను. మోసములకు నిలయమగు కలియుగ మేడ? ఆడినమాటకుఁ గట్టుఁబడి, జనులు కోరిన కోర్కెలఁ దీర్చుట యేడ? శరీరమే యాత్మ యనియు, నది పోయిన నాత్మకూడ నాశన మగుననియు, భయపడువారు పర సంరక్షణమునకై స్వదేహముల నెట్లు పరిత్యజింపఁగలరు!, కాదు. ఫాలలాటలిఖిత మిట్లుండఁ బరుల నిందింపరాదు. ద్విజ వరా! నీపుణ్యమూయె, మాంస మొసఁగుట నీకుఁ జేతకాకుం డిన నీయఁజాలనని, యిప్పుడైనఁ దెలుపుము. వ్యవధియున్నంత వఱకు విప్రమాంసమునకై వేఱొకచోఁ బ్రయత్నింతును. అని, యిట్లు కర్ణకఠోరముగాఁ బలుకుచున్న చిలుకను జూచి, సుకృతుఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

సుకృతుఁడు—ఓ మోక్షార్థుఁడా! సోదరుఁడా! నే నొక క్షణకాల మూరకుంటచే న న్నాడినమాట మీఱువానినిగాఁ దలంచి, శోకభారముచే నేమేమో పలికి యుంటివి. కాని నేను నీవు తలంచుచున్నటుల నాడినమాట చెల్లింపనేరనంతటి కుచ్ఛి తుఁడను కాను. నీ విట్లు పరోపద్రవజనకములగు పదార్థములఁ గోరి, యెందఱుసాధువుల బాధింతువో యని, విచారించుచుంటి నే కాని మాంస మియ్యఁజాలక, యేదియేని కుయుక్తిని పన్నుటకుఁ గాదు. మిత్రుఁడా! కొంచె మాలస్యమైనమాత్రమున న న్నెంతటిమాటలాడితివి! నీవు న న్నేమన్నను సహింపఁగలను కాని, యసత్యమాడువానినిగాఁ దలంచునెడ సహింపఁజాలను.

ఏదేశమున పరమపావనములగు నామ్నాయములు మొదలు తందనాలపదములవఱకుఁ గల సారస్వత మంతయు పరోపకారము పుణ్యాజనక మనియు, పరపీడనము పాపహేతు వనియు, నొక్కరీతిని భూమ్యంతరిక్షములు మారుమ్రోగునట్లు ధ్వనించుచున్నదో, యేప్రదేశమున నాగరికశ్రీమంతులగు సార్వభౌములుకూడ ఆశ్రితజనసంరక్షణమునకై స్వరాజ్యసుఖముల సరకుసేయక నిజజీవితముల ధారవోసిరో, యేవిషయమున శకుంతములుసహితమతిథిపూజకై స్వదేహముల సమర్పించెనో, యేభువనమున నాడినమాటకై యఖండసామ్రాజ్యవైభవమును త్యజించి, కాటికాపరులై మహారాజులు కాలము గడపిరో అట్టి యార్యావర్తదేశమున నట్టి పరమపావనులగు మహాత్ములగోత్రమున, నట్టి పరార్థపరాయణులగు నార్యులసంతతియందు, అందును నతిథిపూజయే దైవారాధనముగా భావించుకొను శ్రోత్రియుల యింటఁ బురుషుండనై జన్మించి, యాడినమాట చెల్లింపకుండుట కంటె వేరు ఘోరపాపము కలదా ?

ఓయీ కీరానుజుఁడా! నీమనోరథము నిదే తీర్చుచున్నాను. అని కుమారులఁ బిలచెను. తండ్రి పిలచినవెంటనే పుత్రులేతెంచి, జనకునకు సాష్టాంగనమస్కారములు చేసి, వినయముతో "తండ్రీ! మమ్ముఁ బిలచినకార్య మెయ్యదియో సెలవిండు" అని పలుకుచున్న పుత్రుల దీవించి, యాభూసురుఁ డిటులఁ బలికెను.

సుకృతు:—వినయనిలయులారా! తనయులారా! ఈ నరజన్మము ఘనమగుటకుఁ గారణము పరోపకారదక్షు మగుట చేతనే కదా! అట్టితఱిని నరులు కేవలము స్వసుఖముల నిమిత్తమే కాలమును గడుపుచో పూర్వజన్మసుకృతపరిపాకవశమునఁ దమకు సంప్రాప్తమైన మానవత్వమును ధ్వంసము చేసికొన్నవారే యగుదురు. మఱియు మర్త్యులకు నిత్యమును, స్వచ్ఛమును, నగు కీర్తి, క్షణభంగురమును, మలినమును, నగు శరీరదానముచే లభ్యము కానున్నపుడు వెనుదీయుటకంటె మూర్ఖకృత్యము కలదా? ఆత్మ నిత్యమని యెఱింగనవారు మృత్యువునకు వెరతురా?

నందనులారా! ఏసంసారికి వశవర్తినియగు భార్యయు, విధేయులగుసుతులును, నుందురో యాకుటుంబియే యిహపరసుఖములనెంటెనిఁ బడయఁగలిగి యుండును. అట్లుకాక, సతీసుతులు తనకు వ్యతిరేకు లగుదురేని యాసంసారిజీవితమునకంటె దుఃఖభాజనమగు జీవనము వేరుండబోదు. ఆగృహస్థుఁడు బ్రతికియుండఁగనే నరకబాధ లనుభవించినవాఁ డగును. సత్కార్యయోగ్యమగు దేహమునను వికలేంద్రియములట్లు ధర్మపరుఁడగు సంసారికి, వశవర్తులు కాని పుత్త్రు లుండియు నిరుపయోగమే. ప్రియనందనులారా! నేనింద్రియపాటవము లేని ఈ వార్ధకమున నుండియు ధర్మలోపము రాకుండ నేఁ జేయుచున్న యతిథిసత్కారాదికార్యము లన్నియు విధేయులగు మీయట్టి

సుపుత్త్రు లుండుటచేతనే సాగుచున్నవని, త్రికరణశుద్ధితోఁ దె ల్పుచున్నాను. ధర్మమున కుపయోగింపనిధనమును, దారిద్ర్యమున ప్రేమింపనిభార్యయు, ముసలితనమున సేవింపని నందనులును, ఆపదల ననువుగాని ధైర్యమును, నీతికిఁ గొఱగాని విద్యయు, మానవుల కుండియు లేనివానితోఁ దుల్యము లే. కులప్రదీపకులారా! నందనులారా! నాకన్నులార మీ త్యాగకళను గాంచి సంతసింప నెంచితిని. కావున మీకు నే నియమించు కార్యమును నెఱవేర్చి, నన్ను సత్యసంధునిగను పూతజీవితునిగను, జేయఁగోరుచున్నాను. ఈముదివయసున నా కెట్టియపయశమును గలుగనీయకుఁడు. అని పలుక ఆవిప్ర కుమారులు నలుగురును క్రమముగా నిట్లు తెలిపిరి.

కేశవుఁడు:—ఓ ధర్మనిరతా! తాతా! పావనపరశురామచరితామృతమును పానమొనర్చి పూతమానసులైయున్న మీసుతులఁ బిలచి, వెంటనే కర్తవ్యమును విధింపక, నేఁడేల! ఇట్లు నీతిబోధల చేయుచుంటిరో తెలియవచ్చుటలేదు! జనకుఁడన ప్రత్యక్షదైవతము కాని సామాన్యమానవుఁడు కాడు. పితృసేవాతత్పరులు కాని పుత్త్రు లుద్భవించుటకంటె సంసారులు సంతానవిహీను లగుటయే మేలు.

నారాయణుఁడు:—తండ్రీ! పుత్త్రులు పుట్టినది మొదలు కంటిని ఱెప్పలట్లు కాపాడుచు, స్వసుఖముల మఱచి, సదా నిజనందనుల యానందమునకై పాటుపడుచు, ద్రవ్యమునకు

నెనుదీయక తమబిడ్డల కున్నతవిద్యల నేర్పించుచు, నిట్లెన్ని యో లెక్కకుమిక్కుటములగు ఘనోపకారముల నిస్పృహతోఁ జేయుచున్న నిష్కలంకానురాగపూరితులగు పితరుల మెడ నాత్మజులు కృతజ్ఞులై యుండవలయు ననెడి పరమధర్మమును మహాభారతమునందలి పూరుచరిత్రమును బఠించిన మీసుతు లెఱుఁగనివారు కారు.

మాధవుఁడు:—జనకా ! శ్రీరామచంద్రుని దివ్యచరితామృతమును బ్రతినిత్యమును గ్రోలి, యానందించు మీపుత్రులకు వా రొనర్పవలసినకార్య మేదియో నియోగింపక, యిటులఁ బల్కుటకుఁ గారణమేమి? పశుదేహమెత్తిన శునకము గాడ యజమానుఁడు తన కొసంగిన పట్టెడుకబళమునే కతిశ్వాసముతో నేలికయింటివాకిట రేయింబవళ్లేమఱక, కాచియుండి, తన కృతజ్ఞతను జూపుచుండ మానవజన్మమెత్తినసుతులు తమకు ధనకనకవస్తువాహనాదిసంపదలను, అనశ్వరమగు సారస్వతవిత్తమును, అమూల్యమగు నీతిభాగ్యమును, మఱియెన్నియో గణనాతీతములగు సిరుల నొసంగి, సంరక్షించుచు తమ జీవితకాలమంతను తనయుల క్షేమమునకై వినియోగించు తలిదండ్రులకు విధేయులు కాకేని వారిని మించిన నింద్యజీవులు వే రెవ్వరు నుండరు. అట్టికృతఘ్నుల హీననామముల నుసంతటి నీచస్థితి భారతవర్షీయులకు సంప్రాప్తము కాకపోవుత !

గోవిందుఁడు:—తండ్రీ! అమూల్యమగు భీష్మవిజయ రసాయనము నాస్వాదించి, యానందించు మముఁ బిత్రువాక్యముల నిరాకరించునంతటి కులపాంసనులముగఁ, దలంపక, మేము మీకు సేయవలసిన సేవ యేదియో యానతిండు. ఆవిధి యెట్టిదైనను చేతులు కట్టికొని చేయుటకు సంసిద్ధముగా నున్నవారము. మేము మీయాజ్ఞను నెఱవేర్చినఁగాని మంచినీటి చుక్కనైన నాలుకపై నిడము. అని యిట్లు వినయముతో ధర్మసమ్మతముగాఁ బలుకుచున్న నందనుల మృదుమధురోక్తులు విని, ఆభూసురోత్తముఁడు, వికసితవదనారవిందుఁడై తన యానందమును ముఖవికాసముచేఁ బ్రకటింపసాగెను.

"నిజమే! పశుపక్ష్యాది తిర్యగ్జంతువులుసహితమర్థశూన్యములగు నిజశాబకకూజితముల విని, యానందపరవశతనొందుచుండ గంభీరార్థగుంభితములగు నీతివాక్యముల స్వనందను లుపన్యసించునపుడు వీనులారఁ వినుచున్న మానవదంపతులు సంతోషపూరితస్వాంతులగుటలో వింత యేమున్నది!"

పిమ్మట ఆవిప్రోత్తముఁడు తన తనయుల నుద్దేశించి యిటులఁ బలికెను.

సుకృత:—నందనులారా! మీ రిట్టిసుగుణభూషితులని నే నెఱుంగకపోలేదు. కాని నే విధించు కార్యము భయంకరమగుటచే కొంచెము మిమ్ము హెచ్చరించితిని. మీధర్మోపన్యాసముల విని, సంతసించితిని. ఇఁక జాగేల? వినుఁడు నేఁదెల్పు

నది. మనముందుఁబడియున్న యీకీరసార్వభౌముఁడు ప్రసూతివాతముచే మరణింపనున్న తనభార్యను విప్రహృదయ మొసంగి, బ్రతికింపుమని, నన్ను వేడికొనినాఁడు. నేనును మాఱాడక, "నీయభీష్టము దీర్తును." అని, బాససేసితిని. కావునఁ దడవు సేయక, మీలో నెవరైన నీచిలుకకు హృదయము నొసంగి, నన్ను సత్యవ్రతునిగాఁ జేసి, మీపితృభక్తిని దిగంతవ్యాప్తమగు నటులఁ జేయవలయును. ఇందుకు మీశరీరములనుండి హృదయకోశమెత్తి యిచ్చుటయే ప్రత్యుత్తరము కాని, వేరుమార్గము లేదని, తెలిసికొనుఁడు. ఈయార్తుఁడు మనకడకు వచ్చి, చాలా కాల మాయెను. ఇఁక జాగుసేయఁజనదు. వెంటనే సర్వదేవతాస్వరూపుఁడగు నీయతిథిని హృద్దానముచే నారాధింపుఁడు. అన విప్రకుమారు లాతీవ్రోక్తుల నాలించినతోడనే, పిడుగుపాటునకు వెఱచుకుణుపులం బోలె హృదయగ్రంథులు పగుల, నిశ్చేష్టితులై, కళలుదక్కి, ముఖములు వెలవెలబారఁ, గొంతవడికి చెదరినధైర్యమును జిక్కఁబట్టికొని, మృత్యుభయముచే గడగడవణకుచు, క్రమముగా నిట్లు పలుకఁదొడఁగిరి.

కేశవుఁడు:—సుతవత్సలా! ఇది యేటివింత? జనకులెచ్చటనైన పరసంరక్షణమునకై స్వాత్మజుల హతము సేయుటకుఁ బ్రయత్నింతురా? మఱియు, "ఆత్మా వై పుత్రనామాసి" అనుటచే సుతుఁడన నిజాత్మాంశమేకదా! అట్టితరిని పుత్త్రుల నశింపఁజేయుట యన నాత్మహత్య గావించుకొనుటయే

యగునుకదా, ఆత్మద్రోహము కంటె వేరుమహాపాతకము కలదా? తండ్రీ! నరుఁడు పితృ దేవమనుష్యఋణములఁ దీర్చినఁగాని ముక్తినందుట కర్హుఁడు కాఁజాలఁడని శ్రుతులు వాకొనుచున్నవి. ఇటులుండ మే మీఋణత్రయమును దీర్పకమున్నే దేహములఁ గోల్పోదుమేని, మా కుత్తమగతు లెట్లు కలుగఁగలవు?

నారాయణుఁడు:—దయామయా! పరులకై నిజనందనులప్రాణముల నర్పింపఁజూచుట సుతవత్సలురగు మీబోంట్లకు న్యాయమగునా? పుత్త్రులు తలిదండ్రులు జీవించి యున్నపుడు వారికిఁ దగునుపచారములు చేయుటకును, మృతులైన పిదపఁ బారలౌకికకర్మల నెఱవేర్చుటకును, సంసిద్ధులుగా నుండవలయునే కాని స్వశరీరనాశనమునకుఁ బూనుకొనరాదు. కావుననే "ఆత్మానం సతతం రక్షే ద్దారై రపి ధనై రపి" అని నీతిశాస్త్రము తెలుపుచున్నది. కావున మానవుఁడు దేనినైనను బోఁగొట్టికొనవచ్చును కాని, ఆత్మను బోఁగొట్టుకొనరాదని, విదిత మగుచున్నది. మే మిపుడు మీయాజ్ఞానుసారము హృదయమునుండి యీకీరమునకు హృదయకోశ మిచ్చుట యన చచ్చుటయే కదా!

మాధవుఁడు:—కరుణానిధీ! సకలధర్మసాధనమగు దేహమును బోఁగొట్టుకొన్నపిదప జీవుఁడు చేయఁదగిన సత్కార్యమేమున్నది. "జీవ న్భద్రాణి పశ్యతి." అనెడి ధర్మశాస్త్రోక్తిని బట్టి చూడ నరుఁడు జీవించి ముక్తి యుండినఁనే సాధకములగు

ధర్మముల నాచరించుటకును, ఐహికసంపదల ననుభవించుట కును, సర్వా(డగును కాని, మృత్యుముఖమునఁ బడినవెనుక నిహపరసంపదలు రెండును దూరమగును. ఇదియునుగాక; నాగరకులగు మానవులు తమసుఖముల నరికట్టి, పరసుఖము లకై స్వాత్మలఁ గోల్పోవుట వివేకలక్షణము కాదు. ఎవరైన నాత్మౌన్నత్యము నెఱుంగని పిచ్చివారు పరులకై ప్రాణముల విసర్జించియుండిన నుండవచ్చును. కాని, వారిత్రోవలునాగరికు లగు ప్రాజ్ఞుల కనుసరణీయములు కావు.

గోవిందుఁడు—ఓయార్తావనధురీణా! మ మ్మనుగ్రహిం చి, మాజీవితములఁగాపాడుము. మేము వేసమార్గమున నీపక్షీం ద్రునికి సంప్రాప్తమైనయాపదను తొలఁగించుటకుఁ బ్రయత్నింతు ము. ఈకీరోత్తమునకుఁ దనకామిని నీరోగిణి యగుటయే ము ఖ్యముకాని, విప్రహృదయము ముఖ్యము కాదు. రోగమును మాన్పుటకు మణిమంత్రౌషధాదులు వేనవేలు కలవు. వానియు పయోగమును దెలిసిన అనుభవశాలు రగువైద్యులును పెక్కం డ్రుకలరు. కావున, కీరాంగనారోగనివారణమునకై తగువైద్యునిఁ దోడ్తెచ్చి, యాసాధ్వికి నారోగ్యము సమకూరునటుల చేతుము. అందుకుఁ దా మనుగ్రహించినచో మాకు మరణభీతియు, నామెకు రోగబాధయు, నివృత్తములు కాఁగలవు. అని, యిట్లు మృత్యుభీతిచే తండ్రియాజ్ఞల నెఱవేర్చుటకు వెనుదీయుచున్న సోదరుల దీనావస్థను, తనయులమాటలకుఁ గినిసియున్న తండ్రి

యొక్క తీవ్రరూపమును జూచి, భీతయై యట నిలచియున్న రుక్మిణి తండ్రికడకు వచ్చి, నమస్కరించి, యిటులఁ బ్రార్థింపఁ దొడఁగెను.

రుక్మిణి—ప్రియజనకా! నాయన్నల శపింపకుఁడు. ఈ చిలుక కోరినట్లు నాశరీరమునుండి వలయుమాంసమును దీసి, యిచ్చెదను. నాసోదరులు దారాపుత్రాదులతో సుఖాపనిందు. సకలవిద్యాపారంగతులై, చేతికందివచ్చినపుత్రరత్నములఁ బోగొట్టుకొనుటకంటె నాయట్టిపుత్త్రికను విడుచుట యుచితము కదా! కావున అన్యథా తలంపక, నాదేహమునుండి హృత్పుండరీకమును దీసి,యీచిలుకజేని కొసంగి, మీయార్తసంరక్షణవ్రతమును బూర్తిసేయుఁడు. కాని, ఓపితృదైవతమా! నేను తిరుగ జన్మమెత్తవలసియున్నచో మీకుఁ దనయనై పుట్టునట్లాశీర్వదింపుఁడు. అని యవనతవదనయై ప్రార్థించుచున్న ప్రియతనయనుఁ జూచి, యాద్విజసత్తముఁ డిట్లు పలికెను.

సుకృత—అమ్మా! సౌభాగ్యవతీ! నీయుదారభావమున కెంతయు సంతసించితి. కాని పుత్త్రికామణీ! నిన్ను నేను పరులకు దానమొసంగియుండుటచే నాకు నీపై నెట్టిహక్కును లేదు. సమస్తస్వత్వములును నీభర్తకే చెందియున్నవి. మఱియు జీవితేశుని యాజ్ఞలేక, సతి స్వతంత్రముగా నెట్టిత్యాగమును, మఱెట్టివ్రతమును, సాగింపరాదు. కావున, నీశరీరమునుండి

పలలవునుదీసి, యీకీరమునకు దాన మొసంగుటకు నీకు వలను పడదు. అని బోధించి, కోపారుణితనేత్రుండై కొమరులవైపు చూచి, యిట్లు పలికెను.

ఓనరాధములారా! మీయట్టిపితృద్రోహులును, అనృతవాదులును, లజ్జావిహీనులును, నగుకుపుత్రులఁ గనుటకుఁ బూర్వభవమున నే నెంతటిదుష్కృతౌఘములఁ జేసియుంటినో! ఆహా! కృతఘ్నులారా! మీ రింతటి కుటిలస్వభావులగుదురని, తెలియఁజాలక, శైశవము మొదలు నేఁటివఱకును మీకు సకలసౌకర్యముల సమకూర్చియు, విద్యలఁ గఱపియు, నీతుల బోధించియు, వివాహముల గావించియు, శ్రమపడితిని. తుదకు నేఁజేసినపని నల్లత్రాచులకు బాలుపోసి, పెంచిన ట్లాయెను. అని కేశవునిఁ జూచి, యిటుల పలికెను.

ఓరీపితృద్రోహీ! కేశవా! నీవు "ఆత్మద్రోహి యగుటకంటె వేఱుమహాపాతకము లే"దంటివి. నీ వన్నమాట నిజమే. ఎవఁడు పరోపకారమునకై పాటుపడక నిరర్థకముగా జీవించుచున్నవాఁడో అట్టివాఁడు తప్పక ఆత్మద్రోహియే యగును. కాని, యెవఁడు దీనజనులఁ గాపాడుటకై సంతోషముతో నాత్మసమర్పణము చేయునో యాపురుషుఁ డాత్మగౌరవముకల మహానీయుఁడగును. కాని, యాత్మద్రోహి కానేరఁడు. ఇది ధర్మసారమెఱింగిన విబుధులకు తెలియును గాని, మీబోటిపండితంమన్యులకుఁ దెలియదు.

మఱియు "నరుఁడు పితృ దేవ మనుష్యఋణముల దీర్చినఁగాని ముక్తినందుట కర్హుఁడు కాఁజాలఁ" డని తెలిపితివి. ఓరీమూర్ఖుఁడా! మానవుఁడు పితౄణమును దీర్పఁదలంచినచో నది యొకజన్మమునఁ దీర్పఁదగినది కాక, యెన్నియో జన్మముల నెత్తి, తనయాత్మ మొదలు సకలసంపదలను జనకునియాజ్ఞకై మనఃపూర్వకముగా సమర్పించినఁ గొంతతీరినఁ దీరవచ్చును. కాని, నిశ్శేషముగాఁ దీర నేరదని, చెప్పవచ్చును.

అట్టిస్థితిలో మొదటిఋణమునే తీర్పఁజాలనివాఁ డు ఋణత్రయమును తీర్చి సద్గతి నందఁజూచుట ఉట్టి కెగురలేనివాఁడు స్వర్గమున కెగరఁజూచుట యున్నది. ఓమూఢుఁడా! పతిభక్తి లేని సతులును, పితృభక్తిలేనిసుతులును, రాజభక్తిలేనిప్రజలును ఎట్టిధర్మములు చేసినను, వేరెట్టిపుణ్యతీర్థముల కేగినను, ముక్తినందఁజాలరు. అని నారాయణుని చూచి, యిట్లు బోధించెను.

ఓరీ కులఘ్నుఁడా! నారాయణుఁడా! ఏమి నీకుటిల పాండిత్యము? నీ వేవో యపూర్వనీతిబోధలఁ జేయఁదొడఁగితివి. మఱియు "పుత్త్రులు తలిదండ్రుల కుపచారములు చేయుటకు సంసిద్ధులుగా నుండవలయునేకాని, స్వశరీరనాశనమునకుఁ బూనుకొనరాదు." అని తెలిపితివి. తలిదండ్రుల కుపచారము చేయుటయన నీతలంపేదియో బోధపడుట లేదు. నిజముగ తండ్రి కుపచారము చేయఁగోరుపుత్త్రుఁడు జనకునియాజ్ఞలు తనకు లాభకరములగునపుడు చేయుటకును, కష్టదాయకము

లగునపు డెగవేయుటకును, చూడఁడు. పిత్రాజ్ఞకై సర్వస్వ మును ధారపోయును. మఱియు సకలసౌఖ్యములఁ సమకూర్చు తండ్రి జీవించియుండఁగనే యాతనియాజ్ఞల నిర్భయముగ నిరాక రించు కొడుకులు తండ్రి మృతుఁడైనపిదపఁ గృతజ్ఞులై, పార లౌకికక్రియల నెఱపుట యెట్లు పొసఁగును ?

ఇదియునుఁగాక "ఆత్మానం సతతం రక్షేత్ " అనెడిధర్మ వాక్యము నొకదానిని పేర్కొంటివి. కాని, దానికి సరియగు నర్థ మును తెలియఁజాలక స్వప్రతిభ నాధారము చేసికొని, ఏమే మో యుపన్యసించితివి. ఓపండితంమాన్నీ ! దానియర్థము నీవు తలంచినయట్లుమాత్రము కాదు. మఱేమన; ప్రాజ్ఞుఁడు కాంతా కనకాదులపై రాగముచే ఆత్మశక్తిని వృథాగా వ్యయ మొన ర్పక, పరోపకారార్థ మాత్మను సంరక్షింపవలయు ననియే దానియర్థము. అని మాధవునిఁ జూచి, ఇటుల పలికెను.

ఓకలుషాత్ముఁడా ! మాధవుఁడా ! నీవు చావునకు వెఱ చి, " జీవన్ భద్రాణి పశ్యతి " అనెడిధర్మవాక్యమును పూర్వా పరసంగతి నెఱుఁగక తెలిపియుంటివి. మర్త్యుఁ డెప్పటికైన నీ దేహము విడువవలసినదనియే యనియు కావున, జరావ్యాధు లచే, జూచుటకుఁగూడ నసహ్యతను బుట్టించునంతటిదుర్దశ యీ శరీరమునకు ప్రాప్తమైనపిదపఁ జేయున దేదియు లేక, తుది కాలమున నిరర్థకముగా బొందినిఁ బోఁగొట్టుకొనుటకంటె జీవిత కాలములో నెప్పుడైనఁ దనదేహసమర్పణమువలన పరోపకార

కార్యము నెఱవేర్పదగునంతటి భాగ్య మబ్బునేని, నరుఁడు మారాడక, సంతోషపూర్వకముగా నీదేహమును విసర్జించుటచే నిహలోకపరలోకముల తమపవిత్రనామధేయములు ప్రశంసింపఁబడుచుండు ననెడిగంభీరార్థము నెఱుఁగవైతివి. "జీవన్" అనగా పరార్థము జీవించుచు, "భద్రాణి" త్యాగఫలములను, "పశ్యతి" పొందగలఁడు అనిభావము కాని జీవన్మృతుఁడై యని తాత్పర్యము కాదు.

మఱియు నాగరికు లెవ్వరు పిల్లుచేయ రనెడియపూర్వాశయము నొకదానిని తెలిపితివి. దీనింబట్టి చూడ నీతలంపున నాగరకతయన మానవులు విషయసుఖమాత్రపరాయణులై, గంగిరెద్దులవలె వలువలదాల్చి, దంభముగాఁ దిరుగుటయని, తోఁచుచున్నది. ఇదేదియో నవీననాగరకతయై యుండనోపు. కాని, సనాతనార్యనాగరకత యిట్టి దెంతమాత్రమును కాదు. దానిస్వరూపము వేరు. ఇవి నాయున్నతసౌధము లనియు, వీరు నాసుందరాంగన లనియు, వీరు నాముద్దుబిడ్డ లనియు, ఇది నాసుకుమారదేహ మనియు, ఇవి నాయుద్యానవనాదిసంపద లనియు, మమతఁ జెందక, సర్వసంపదల నార్తజనసంరక్షణమునకై త్యాగము సేయుటకు, సిద్ధముగా నుండుటయే సనాతన నాగరకత.

ఇంకను "పరసుఖములకై తమప్రాణములు కోల్పోవుట వివేకలక్షణము కా"దని, నుడివితివి. ఓయల్పజ్ఞుఁడా! ఈభారత

దేశము ఘనతచెందియుండుటకు ముఖ్యకారణము నిరుపమాన యశస్కులగు త్యాగవీరు లింనుదయించుటచేతనే. "పుత్రైర్యశో లభ్యతే" అనినట్లు ఆ ప్రజాసంరక్షణార్థము తమజీవితములు ధారవోయుటయే దేహమెత్తినందుకు ముఖ్యఫల మనెడి ఘనాశయములుకల తనయు లుదయించుటకు సంసారు లెంతటి భాగ్యశాలురుగా నుండవలయు! అని గోవిందునిం జూచి, యిట్లు నుడివెను.

ఓరీ కుటిలాత్ముండా! గోవిందుండా! ఏమినీ నేర్పు! నరుండు తానిచ్చెదనన్న దానినిమారుమాటాడక, యిచ్చినపుడే యాడిన మాట తప్పనివాండగును. కాని, పరుండు వేడినదాని నియ్యనేరక, ఇతరవస్తువులు నిచ్చెదనని, తప్పించుకొనంజూచుటచే కాదు. అట్లు కవేయంజూచువాండు మోసగాండగు లౌకికుండగును కాని, సత్యవ్రతుండగు శ్రోత్రియుండు కాంజాలండు. అని పుత్రులనందఱినింజూచి, తిరుగ నిట్లు పలికెను.

మూర్ఖశిఖామణులారా! మీరు నే నియమించినవిధిని నెఱవేర్పకుండుటయే కాక, పైగా ధర్మశాస్త్రములనుండియు, పురాణములనుండియు ప్రమాణవచనములం బ్రోడీకరించుచు, నాకు ధర్మబోధలం జేయుటకుంగూడ మొదలిడితిరి. ఓపితృనిందకులారా! మీ రెన్నియో శ్రుతిస్మృతులం బేర్కొని యుంటిరే! వానియందెచ్చటనైన నాడినచొప్పున నడచికొనక, మృత్యుభీతిచే పరోపకారవిముఖులై, తండ్రిని ద్వేషించిన యసత్యవాదు

లును, ధర్మశూన్యులును, పితృద్రోహులు నగుపుత్రాధములఁ గూర్చి యేమైన వ్రాయఁబడి యున్నదేమో! పరికించితిరా? అని వారు చేసినతిరస్కారమునకుఁ గోపోద్దీపితుఁడై, తనయుల శపింప సంసిద్ధముగానున్న సమయమున లోపలనుండి తండ్రి గొడుకులకు జరుగుచున్నసంభాషణము విన్న ఆసుకృతుని భార్య యగుమీనాక్షి మృత్యుభీతులై, పరసంరక్షణమునకు తమప్రాణముల సమర్పింపఁజాలనట్టి ధైర్యహీనులును నింద్య జీవితులును నగునందనులు తనకడుపునఁ బుట్టినందులకు లోఁగుందుచుఁ బరుగుపరుగున పైకి వచ్చి, పుత్త్రులవైపు దుర్నిరీక్షుఁడై చూచుచున్న నిజనాథునిఁ గనుఁగొనెను. అపు డాసాధ్వి మానసమును తపోధనుఁడగు తననాథుఁడు కోపముచే సుతుల కెట్టి దారుణశాపము నొసంగునో! యనెడిభీతియు, జనకుని భీకరాకారమును జూచి, గజగజవణకుచున్న నందనులఁ జూచుటచేఁ గరుణయు, స్వవల్లభునిముందు పడియున్న దీనకిరమును జూచుటచే జాలియు, నొక్కసారి చుట్టుకొనఁదొడంగినవి.

అంత నాభూసురకాంత ధీరస్వాంతయై, ప్రాణేశ్వరునకు ప్రదక్షిణనమస్కారము లొనర్చి, భీతులై నిలచియున్న పుత్త్రులఁగూర్చి యిటులఁ బలికెను.

మీనాక్షి—అయ్యయ్యో! పుత్త్రులారా! చిన్ననాఁడాఁకలిదీర్చుకొనుటకుఁ గాని, ఆపదలనుండి తప్పించుకొనుటకుఁ గాని, సమర్థులు కాకయున్నది మొదలు పెద్దవా రగువఱకు

తండ్రులు తమపుత్త్రిలకుఁ జేయు నవ్యాజానురాగపూరితము లగు నుపకృతుల మఱచి, మొదటినుండియుఁ దా మిట్టులనే యవయవపాటవముకల యువకులముగా నుంటిమని తలఁచుచు, సంసారరాగాంధతచే దైవసములగు తండ్రులఁ బూజింపక, అనిత్యములును, నిస్సారములును, నగువిషయసుఖముల విడువఁజాలక, యెంతటి పుణ్యకార్యమునకు వెనుదీసితిరి. మీకు వినశ్వరములగు సంసారసుఖములజాడలే కానవచ్చినవి. కాని, శాశ్వతానందసంధాయకములగు పరలోకమార్గములు జూపట్టినవి కావు. అట్టివానిఁ జూచుట కీసామాన్యనేత్రములు శక్తములు గావు. వానిం దిలకించుటకు జ్ఞానచక్షువు లుండవలయును. మఱియుఁ బరులయాపదల నివారింపఁదమ జీవితముల నామోదముతో సమర్పించుచున్న వీరవరేణ్యులగు పుత్త్రిసింహులయొక్క చిఱునగవుతో నలరారుచున్న వదనారవిందములఁ గన్నులారఁ గాంచి, యానందించునంతటి భాగ్యము సమకూరుటకు సతులెంతటి పుణ్యవతులుగా నుండవలయును! అని నిజనాథునిఁ జూచి, ఇట్లు పలికెను.

ప్రాణేశ్వరా! పర మెఱుఁగక, యిహమే మోక్షస్థానమనెడి పిచ్చితలఁపులు కలవారై, మరణము నిత్యమని గుర్తింపక, చావునకు వెఱచి మీయాజ్ఞకు వ్యతిరేకముగా ప్రవర్తించిన యీదీనులఁ గరుణించి, యీవిధేయురాలు చేసికొనుచున్న విజ్ఞప్తి నాలింపఁ బ్రార్థించుచున్నదానను. మనోవల్లభా! మె

దట గృహమునకు వచ్చిన యతిథి కర్ఘ్యపాద్యాదుల నిచ్చి, పూజించుట గృహయజమానుల పని. పిమ్మట నాయతిథిదైవతములకు, వలయుపదార్థముల వండి వడ్డించుట, ఆయింటి యిల్లాండ్రపని. కావున, మీ రీశుకనాయకు నాదరించి, మీరు చేయవలసిన సపర్యను నెఱవేర్చితిరి. ఇఁక మీయర్ధాంగి నెఱపవలసిన యతిథిసేవ కొఱవడి యున్నది. కావున, జీవితేశా! ఈ నాశరీరమునుండి హృదయమును దీసి, యీయతిథికి సమర్పింపనున్నాను. నాయందు దయయుంచి యీయారాధనమున కనుజ్ఞ నొసంగి "మీనాక్షి, తనజీవితమును ద్యాగము చేసి నిజనాథుని సత్యవ్రతమును గాపాడినది" అనెడి యశము నాకు సమకూర్పుఁడు.

మఱియు నోప్రియవల్లభా! మీ రసదృశత్యాగశీలుర గుటచే నారక్షసంరక్షణమునకై మీప్రాణముల నెపుడు నిర్లక్ష్యముగాఁ ద్యాగ మొనర్తురో! అంత నా కెంతటిదురవస్థ తటస్థమగునో! అని ప్రతిక్షణము బెంగటిల్లునాకు దైవకృపచే, నీ చిలుకరాయనికి హృదయకోశ మొసంగి, సుమంగళినిగా నోడలు వీడుసంపద సంప్రాప్తమైనది. కావున నాకోరికను నిరాకరింపక, నామనోరథ మీడేర్చి, నన్ను ధన్యురాలినిఁగాఁ జేయఁ బ్రార్థించుచున్నదానను.

మీరు నా వేడికోలును సరకుసేయుక, యీకీరపుంగవునకు, మీహృత్పుండరీకము నొసంగినచో నేను దుర్భరవైధవ్య

దుఃఖముచే మఱియును నే కాని, మనఁజాలను. వెలుతురులో నుండి చీఁకటిలోఁ బడుటకంటెను, స్వర్గమునుండి నరకమున కేఁగుటకంటెను, సంపదలోనుండి బీదరికమునఁ జేరుటకంటెను, సౌభాగ్యములోనుండి వైధవ్యమునఁ బడుట అతిదుస్సహము. అమంగళావహము. కావున, నే నట్టిదుస్స్థితికి రాకుండఁ జేయ మీాపదములకు వందన మొనర్చుచున్నాను. అని, యాకసము వైపు చూపులఁ బరపి యిట్లు పలికెను.

"ఓత్రిపురాంతకమనోహారి! గిరిరాజకుమారి! పతిపద నారవిందమును బరికించుచుఁ బరమానందముతోఁ బరలోక మున కేఁగుభాగ్యము నీభక్తురాలి కనుగ్రహింపుము." అని ప్రార్థించుచున్న యాసాధ్వీమణి పావనోక్తులకుఁ గపటకీరవేష ధారియగు పాకశాసనుఁడచ్చెరువొంది, యాయిల్లాలిని గూర్చి యిట్లు పలికెను.

చిలుక—ఓసాధ్వీమతల్లీ! నిక్కముగ నీవే యీానస్య వ్రతుఁడగు శ్రోత్రియునకుఁ దగిన యర్ధాంగివి. ఓహో! ఓ యమ్మా! మృత్యుముఖమునఁ బడనున్న నిజగర్భజనితుఁ జూచి, విలపించుటకు మాను, నాను పితృద్రోహులైనందులకు వగచుచు, నీపతియాజ్ఞమాట నిలుపఁబెట్టుటకు నిజదేహమును సమర్పింపఁ, బ్రియుని బ్రతిమాలుకొనుచుంటివి! అహా! తల్లీ! మొదట నేను నా కిట్టిదుఃఖమును దెచ్చిపెట్టినందుకు దైవము నజ్ఞానముచే దూషించితిని. కాని యాకరుణామయుఁడు నాకు

మీయట్టి లోకోత్తరపావనచరితులగు పుణ్యదంపతుల రూపము లఁజూపుటకును, మీ యసమానగంభీరభాషణముల వినిపించుటకును, కోరియే యీదుఃఖమును దెచ్చిపెట్టినటుల నిపుడు తెలిసికొంటిని. సర్వజ్ఞుఁడును, దయామయుఁడును నగుభగవంతుఁడు చేయుపనులలో నక్రమ మేదియు నుండఁజాలదు. కాని ప్రజలు దూరదృష్టి లేక, దైవకార్యముల నిందింపఁదొడఁగుదురు.

మాతరో! వైద్యుఁడు ద్విజహృదయమును దెస్మనెను. కాని, ద్విజీహృత్కంజమును దెస్మలేదు. కావున నాఁడువారి గుండెకాయ పనికిరాదు. అమ్మా! ధైర్యమును పూని, నీభర్త చే నాకు హృత్పుండరీకము నిప్పించి, యీమూర్తుఁడగుపుత్త్రునిఁ గాపాడుము. అని ప్రార్థించెను.

అంత సుకృతుఁడు తనయులఁ జూచి, యిటుల పలికెను. ఓపాపాత్ములారా ! ఆత్మజులారా ! మీరు పరోపకారార్హములగు మానవదేహములఁ దాల్చియుండుట కెంతమాత్రము నర్హులు కాఁజాలరు. కావున మీరు చేసిన పితృద్రోహమునకు కుణపదేహమాంసముల భక్షించు రాబందులై పుట్టుదురుగాక! యని శపియించి, వెంటనే కీరాభిముఖుఁడై యిట్లు పలికెను.

సుకృత—ఓకీరవరేణ్యా! నా జాగుసేతకు క్షమింపుము. ఇదే నేను సంధ్యావందనాద్యాహ్నికకర్మల నెఱవేర్చి శుచినై, యున్నవాఁడను. ఇఁక జాగుసేయక, చేకొనుము వలయు పలలము. అన నాకపటశుక మిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

చిలుక—ఓభూసురకులావతంసమా! బ్రాహ్మణహృదయ కోశము వేదపఠనములచేతను, యజ్ఞీయాన్న భక్షణములచేత ను, కలుషరహితమై, నవ్యగవ్యనవనీతమువలె నిర్మలముగ నుం డును. కావున పావనమగు మీహృదయకమలము నాకొసంగి, సత్యవ్రతమును గాపాడుకొనుఁడు. ఆ వైద్యుఁడు కోరినమందు నిదియే. అన భూసురోత్తముఁడును హృదయదాన మొసంగుటకు నిశ్చయించుకొని, దర్భాసనాసీనుఁడై తనలో నిట్లు తలంపఁ దొడఁగెను.

సుకృత—"వినశ్వరమగు నాదేహ మేవ్యాధిచేతనో చెడి, నిరర్థకము కాకుండ నొకయాప్తుని సంతోషపెట్టుటకు విని యోగించుచుండుటచే సార్థకమగుచున్నది." అని, తా నాడిన మాట కెట్టివిఘ్నము లేక, నెఱవేఱుచున్నందులకు పులకిత గాత్రుఁడై, మోమునఁజిరునగవొప్ప, భార్యను జూచి, యిట్టుల బోధించెను.

ప్రాణేశ్వరీ! ఈ కీరనాయకుఁడు తెలిపినట్టుల ధైర్యము కలదానవై నేఁజేయు నతిథిపూజావ్రతమున పాల్గొనుము. కళత్ర వంతుఁడు భార్యనువీడి, యెట్టివ్రతమును చేయరాదు. కావున సంతోషముతో నుండుము. విచారింపకుము. పతి,దాన మిచ్చు నపుడు సతి, విలపించిన ఆ దానఫలము చెడును. అని, చిలుకను జూచి, "ఓయతిథిశ్రేష్ఠుఁడా! నావక్షమును నీ నిశితచంచుపుట ముచే విదళించి, హృదయకోశమును దీసికొని, నీయర్ధాంగి

కౌఁగిలించి, నన్నుఁ గృతార్థునిగాఁ జేయుము. నీవు వచ్చినవెంటనే నీమనోరథము నీడేర్పక, యింతతడవు జాగుచేసినందుకు మన్నింపుము. నీకై యట నీకాంత మొఱలిడి విలపించుచుండునో కదా!" అని, యిటుల ధైర్యోత్సాహములతోఁ దన్ను హెచ్చరించుచున్న బ్రాహ్మణోత్తముని చరితమునకు సురేంద్రుఁడు దన్ముఖతఁ మొంది యిటుల పలికెను.

చిలుక—ఓ విప్రకులంకపావనఘనచరితా! మీయాదర భావమున కెంతయు సంతసించితి. కాని నేను దుఃఖసాగరమున మునింగియుండుటచేతను, నేఁటి కేడుదినములనుండి యాహారము లేక కృశించియుంటను, వార్ధకభారముచే దుదుపాటవము సడలియుండుటను, నే స్వయముగా నీకఠినోరస్థలమును భేదింపఁ జాలను. కావున స్వయముగ నీవే వక్షమును విదళించి, హృదయకోశ మొసంగి, నామనోరథ మీడేర్పుము. ఇఁక నాలస్యము చేయకుము. అరువదిఘడియలు మించకుండ ద్విజహృదయమును నాభార్యకొసంగినచే యాసాధ్వి జీవించును. కాని యటు పైని నీవిచ్చియుఁ బ్రయోజనము లేదు. నాభార్యను విడచి, యిప్పటికి ముప్పదిరెండు గడియలకాలము గడచినది. మిగిలిన యర్ధభాగము లోపున నే నచటి కేఁగవలయును.

సుకృత—ఖగవరేణ్యా! నీవు కోరినట్లు నేనే నాయురమును చీల్చికొందును. నీముక్కుతో నాహృదయము నంది

కొనుమని, నిశితాసి నొకదానిని చేఁబూని, భగవంతు నిటుల స్తుతింపఁ దొడంగెను.

"ఓ సర్వాంతర్యామీ ! సర్వజ్ఞా ! కృపామయా ! నేను నిజమగు సత్ప్రవర్తనముగల శ్రోత్రియుఁడ నేని, అతిథిపూజల నే మరక నాదరముతో జేయుచుంటి నేని, దురితదూరుఁడ నేని. ఏక పత్నీవ్రతుఁడ నేని, నాయందు నీ కనుగ్రహము కలదేని, నాకుఁ దిరుగ జన్మము ననుగ్రహింపఁ దలంచితేని, న న్నే తిర్యగ్జంతు గర్భమున నో పుట్టింపక, జ్ఞాననిలయమును పరసేవానుకూల మును నగు మానవదేహమును నాకుఁ బ్రసాదింపుము. మఱి యు నేయవనదేశమున నో పడవేయక, యీ యార్యావర్తజన పదమునఁ బుట్టించి, స్వోదరపూరణపరాయణుఁడనగున ట్లొనర్ప క, దీనజనావనమునకై జీవితములు కూడ నిర్లక్ష్యముగా నొసం గునంతటి ధైర్యశాలి నగున ట్లనుగ్రహింపుము.

నే నొసంగిన హృత్క్లేశముచే నీ కీరసోదర భార్య యారోగ్యవతియై, పుత్త్రపౌత్త్రాభివృద్ధితోఁ జిరకాల మీశుక నాయకునితో సంసారసుఖముల ననుభవించునటులఁ గూడ ప్రసాదింపుము. ఓసర్వేశ్వరా ! నా యీయవసానవందనము నందుకొను" మని కరపుటము ఘటియించి, నమస్కరించి, యే హస్తముతో దేవతలకు హవిర్దానములను, యేకరముతో పితరు లకుఁ దర్పణములను, యేచేతితో దేవతార్చనములను, యే బా హువుతో నతిథిపూజలను, యేపాణిపంకజముతో దానధర్మము

లను, నెరపెనో అట్టి పావనమగు దక్షిణకరముతో ఖడ్గమును బట్టి, వక్షమును విదళించి, వెంటనే హా జగదీశా! యని, మూర్ఛితుఁడై దర్భాసనముపై నొఱఁగెను.

అపు డవి చూచుచున్న మీనాక్షియు ధైర్యమును చిక్కఁబట్టి, దర్భాసనముపై నొఱఁగిన నిజనాథునిశిరమును తన తొడపై నిడికొని, కరములుమోడ్చి, తన ఇష్టదైవతమగు శంకరి నిట్లు ప్రార్థింపఁదొడంగెను.

"అమ్మా! సర్వమంగళా! ఇట్లు పరసంరక్షణమునకై ప్రాణదాన మొనర్చిన పావనోదారచరితుఁడగు భూసురోత్తము నకు నిల్లాలనై, సదా పతియాజ్ఞల కడుగుదాటక, నడచుచున్న నన్నే దుర్దశను బొందనీయకుము. తల్లీ! పార్వతీ! చిన్ననాఁటి నుండియు నిన్ను త్రికరణశుద్ధితోఁ బూజించుచున్న యీసేవకు రాలు వేఱెట్టిరాజ్యసంపదను గోరుటలేదు. తననుదుటి కుం కుమబొట్టును చెక్కుచెదరకుండునట్లు చేయుమని, ప్రార్థించు చున్నది. జననీ! మీనాక్షీ! నీపవిత్రనామముచేఁ బిలువఁబడు చున్న యీదాసురాలి సౌభాగ్యమును గాపాడవేని, లోకులు మీనాక్షి కెట్టి దురవస్థవచ్చెనని, యమంగళముగఁ బలుకుటను విన మృత్యుంజయుని రాణివగు నీ వెట్లు సహింతువమ్మా?" అని, నిజనాథునిరక్తముచేఁ దడసియున్న కత్తినిఁజూచి,

"అయ్యో నేనెంతటి వెఱ్ఱిదానను. నాజీవితేశ్వరునకు సత్యవీరస్వర్గము నను గ్రహించిన ప్రత్యక్షదైవతము ఖడ్గ

రాజను ప్రత్యక్షమగుచుండ పరుల వేఁడనేల? ఓకృపాణరా జమా! పరిణయమైన దాదిగా నొకక్షణమైన నెడబాటులేక, యొకదేహముననే యున్నయట్లు సంచరించుచున్న మాయిట్టిదంపతుల విడఁదీయుట నీయట్టి కృపాళురగు కృపాణులకుఁ దగదు. నానాథునకు నాయెడ నెట్టి యనురాగముకలదో యాదయామయుని హృదయమును జొచ్చినసీకుఁ దెలుపవలెనా?" అని, ఖడ్గమును చేఁబూని ఓ కరవాలమా! పతివ్రతలగు నాస్త్రరాం ద్రమెడ నిజముగ నీకు కరుణకలదేని, నాజీవితేశ్వరునికడ నన్నుఁగూడఁ జేర్పుము.' అనిప్రార్థించి, కత్తికొనను హృదయమున కెదురుగఁ బెట్టి, పొడిచికొనమండ—

సురసార్వభౌముఁ డాదంపతుల సాహసోదారకృత్యములకు వెరగంది, వెంటనే శుకరూపమును విడచి, నిజరూపధారియై, కత్తితో నురమునఁ బొడిచికొనుటకు సంసిద్ధముగా నున్న మీనాక్షికరమునుండి ఖడ్గమును జేకొని, నేలఁబడియున్న భూసురునివదనమున నమృతముంబోసి మృత్యువశుఁ డగుచున్న యాశ్రోత్రియునకుఁ దిరుగ స్మృతినిఁ గలిగించెను. అంత సుకృతుఁ డాసుధాస్నేహప్రసారమున నీరసించుచున్న చైతన్యదీపకళ తిరుగఁ బ్రకాశింప, నిద్రనుండి మేల్కాంచువానివలెఁ గన్నులు విప్పి, యమృతకలశమును చేఁబూని, యెదుట నిలిచియున్న నాకనాయకునిఁగాంచి, దిగ్భ్రమఁజెంది, తత్క్షణము దర్భాసనమునుండిలేచి, "ప్రాణేశ్వరీ! త్వరితముగ నర్ఘ్యపాద్యా

చులఁగొనితెమ్ము." అని, భార్యను నియమించి, తనపాదము లకు నమస్కరింప వంగుచున్న సుకృతుని లేవనెత్తి, కౌఁగిలించి, యాసురపతి యిటుల ప్రశంసింప సాగెను.

సురేంద్రుఁడు:—ఓయసమానపుణ్యచరితుఁడా! భూసురోత్తముఁడా! నేను నీకు నమస్కరింపవలసినవాఁడనుగాని నీయట్టి త్యాగశీలురకు నమస్కరింపఁ దగినవాఁడను కాను. ఓయనఘాత్మా! నేను దిగంతవ్యాప్తమై యున్న నీత్యాగగరిమనుఁ బరీక్షింపఁగోరి, యిటులఁగపటకీరశరీరధారినై వచ్చి, నిన్ను హృదయమర్ధించితిని, తెలిసికొంటిని నీయనుపమానధైర్యౌదార్యముల. విప్రవరా! నాయీయపరాధమును క్షమింపుము. నీయట్టి సుకృతాత్ముని సందర్శించుటచే ధన్యుఁడనైతిని. స్వర్గమర్త్యపాతాళముల నెటఁజూచినను స్వసౌఖ్యములకై పరుల గారడి సేయువారే కానవత్తురుకాని, నీయట్టి నిరుపమానత్యాగకళాభాసురులు కానరారు.

నిక్కముగ నీయట్టి త్యాగధను లుదయించినదేశమే ధన్యము, నీవంటి పుణ్యపురుషుఁడు పుట్టిన వర్ణమే వర్ణ్యము, నీబోటి త్యాగరతునిఁ గన్నతల్లియే సతీమతల్లి. ఓయుదారచరితా! నీవంగీకరింతువేని, యీసురేంద్రుఁడు స్వర్గరాజ్యమును విడచి, యిట భూలోకమున నీకు దాస్యముచేసి, కృతార్థుఁడగుటకు వేచియున్నవాఁడని, గ్రహింపుము. అని, బ్రాహ్మణోత్తమునకుఁ బ్రదక్షిణనమస్కారములఁజేసి, నిలిచియున్న సురపతి

పాదములకు సుకృతుఁడు భార్యాసహితముగ నమస్కరించి, వేదవాక్కులచే పరిపరివిధములఁ బ్రస్తుతించెను. మీనాక్షియు తనపతిని బ్రతికించినందుల కమరనాథు ననేకవిధముల స్తుతించెను. అంత నావేల్పులయొడయుఁడు పుడమివేల్పును గౌగిలియొడి, యావిప్రవరేణ్యునకు సకలసంపదల నొసంగి, ఆచంద్రార్కము చిరయశస్కుఁడవై, యుండుమని వరమొసంగి, ఆవిప్రునకు స్వదర్శనసంభాషణాదికమున మఱపురానిసంతసమును గలిగించి, యదృశ్యుఁడయ్యెను. పిమ్మట మీనాక్షియు తనకు సౌభాగ్యమొసంగిన మంగళప్రదయగు పార్వతిని నుతించి, యానందవికసితవదనారవిందయై, రెప్పవాల్పక, వినిర్మలానురాగమును వెదజల్లు చూపులతో తనప్రాణేశునివైపు చూచుచు నిలచెను.

అంత నాభూసురుఁడు క్రమముగ నింద్రకల్పితమగు మసకబీడ కనులఁదెరచి, నిజకాంతను గాంచి, యిటులఁ బలికెను.

"సాధ్వీమణీ! నే నేదియేని కలగంటినో! లేక, యథార్థముగా జరిగినదానిని జూచియుంటినో! తెలియఁ జాలకున్నాను. నేనాకీరనాయకునకు నాహృదయకోశమును సమర్పింపబోవుచుండ జీవింపిదప నడచినగాథ యేదియో నీవెఱింగి యున్నచో జాగుసేయక తెల్పుము. నామానసము సంభ్రాంతమై యున్నది." అన మీనాక్షి సుకృతునకు నమస్కరించి, యిటులఁ బలుకఁ దొడఁగెను.

మీనాక్షి:—జీవితేశ్వరా! వినుఁడు నివేదింతును మీపావనోదంతమును. మీరట్లానందముతో వక్షమునువిదళించి

వెంటనే "హా జగదీశ్వరా !" అని, కనులు మూసి, దర్భాసనముపైనొరుగుచుండ ఆసమయ మెంతటి భయంకరమైనదైనను, మీయాజ్ఞను శిరమున దాల్చి, ధైర్యమూని, కంటఁదడిఁ బెట్టిన నన్యదుర్లభమగు మీహృదయదాన మెక్కడ నిష్ఫలమగునో యని, తలంచినదాననై, మీతలను నాతొడపై నిడికొని, పార్వతిని "నాపాతివ్రత్యమును నిలువబెట్టుమని," ప్రార్థించి, మీవియోగదుఃఖమును సహింపఁజాలక వెంటనే మీపదసరసిజములకడఁ జేరఁగోరి, మీకు వీరస్వర్గము నొసంగిన ఖడ్గరాజమును చేపట్టుకొనినదాననై, హృదయమునఁ బొడుచుకొనుటకుఁ బ్రయత్నించుచుంటిని.

సుకృతి:—ఆహా! సతీమణీ! నాయందలి ప్రేమచే నెట్టి సాహసమును చేయఁబూనుకొంటివి ! నిజముఖ రూపమును దర్శింపఁగోరువాఁ డద్దాని నద్దమునందే చూచుకొనిని పురుషుఁడు ప్రేమయొక్క నిజాకృతిని తెలియఁగోరినచో దానిని నిజకాంతాహృదయ ముకురము నందే చూడఁగలఁడు కాని, మఱివేరు తావునఁ గాంచనేరఁడు. ప్రేయసీ! పిమ్మట నేమిజరిగెను ?

మీనాక్షి:—హృదయేశా ! ఏమని తెలుపుదాన ! నే నిదివఱకు కనివిని యెఱుంగని దివ్యతేజ మొకటి తళుక్కుమని, కోటి మెఱుపులు మెఱసినట్లు కానవచ్చెను. నే నావెలుఁగును చూచి, నిశ్చేష్టితురాల నైతిని. వెంటనే యాకాంతిమండలము లోనుండి దేవేంద్రుఁడు సుధాకలశము చే నిడికొని, ప్రత్యక్షమాయెను.

సుకృత:— కాంతామణీ! ఎంతటిధన్యాత్మురాలవు! ప్రత్యక్షముగ శచీకాంతు నీక్షింపఁ గల్గితివి. సౌభాగ్యవతీ! పిమ్మట నేమాయె ?

మీనాక్షి:—మనోవల్లభా! మీయట్టి నిరుపమాన త్యాగవ్రతునకు నర్ధాంగియగు సాధ్వి శచీధవుని కన్నులారఁ గాంచుటలో వింతయేమున్నది!. వినుఁడు, వెంటనే సురపతి నా కరమున నున్న ఖడ్గమును దీసికొని, తనచేతనున్న కలశము లోని యమృతమును మీనోటిలోఁ బోసెను. ఆవెంటనే మీరా యమృతస్పర్శచే నన్ను మంగళాంగినిగఁ జేయఁగోరి, కన్నుల విప్పితిరి. పిమ్మట జరిగిన వృత్తాంతము మీకుఁ దెలిసియే యున్నది.

సుకృత:—జీవితేశ్వరీ! ఈనడచినదంతయు సురనాయకుని మాయగాని సత్యముగ జరిగిన వృత్తాంతము కాదా? కట్టా! నాయీజరఠదేహము పరసంరక్షణమునకై వినియోగించెను కదా! యని, సంతసించితిని. కాని యల్పభాగ్యుఁడనగు నా కట్టిపుణ్యము చేకూరదాయె. ఇఁక నే నీశరీరము నేరోగబాధచేతనో నిరర్ధకముగ విడువవలసినదే. ఈసురేంద్రుఁడు చిలుకకథ నసత్యముచేసి, నా కమితఖేదమును గూర్చెనేకాని నానోట నమృతముబోసి, నా కాతఁడొనర్చిన మేలేదియుఁ గానరాదు. వృథాగా నాపరసంరక్షణవ్రతమునకు భంగమొనర్చినాఁడు.

మీనాక్షి:—దయానిధీ! మీ రిట్లు విచారింపవలసిన పనిలేదు. కారణ మేమందురా? చిలుకకథయే నిజమైయుండిన నిజహృదయము నిచ్చి, శుకభార్యను గాపాడినవారై యుందురు. అటుగాక పైకథ యసత్యమగుటచే నీభూసురభార్యను గాపాడితిరి. అందుచే మీరెటుజూచినను ద్విజకాంతను గాపాడినవారే యగుచున్నారు. కావున మీకభీష్టమగు పరసంరక్షణఫలము సంప్రాప్తమయ్యే యున్నది.

సుకృ:—మంజుభాషిణీ! నీవు తెలిపినది సరిపడియుండ లేదు. ఏమందువా? నేను నిజముగ శుకభార్యను గాపాడిన నాఁడే పరసంరక్షకుఁడ నగుదును కాని నా యర్ధాంగివగు నిన్ను బ్రోచుటచేఁగాదు. నీవు నాకంటెఁ బరురాలవు కావు. మన యాత్మలు రెండును నొక్కటే. అని, ఇటుల నమితానందము గ్నులై సంభాషించుచున్న తలిదండ్రులపాదములపైఁబడి, యా విప్రకుమారు లీరీతిని బ్రార్థింపఁ దొడంగిరి.

విప్రకుమారులు:—దయానిధీ! తండ్రీ! అజ్ఞానముచే మేముచేసినయపరాధముల క్షమింపుము. మరణమునకు వెఱచి, యట్లు పలికితిమి. ఏమిచేతుము. మేమెంతప్రయత్నించినను జీవితాశ మమ్ము వదలదాయె. మేము నిరుత్తరముగా పితృవాక్యమును నెఱవేర్పఁ జాలనందులకు లజ్జించుచుంటిమి. ఓసుతవత్సలులారా! పితరులారా! మాయపరాధముల క్షమియించి, శుకేంద్రునికివలెనే మాకును నభయమొసంగి మమ్ము శాప

పాశవిముక్తులుగాఁ జేయఁగోరుచున్నారము. అని పరిపరివిధముల దీనులై, వేడికొనుచున్న పుత్రులను జూచి, పూర్వపుకోప ముపశమింప, సుకృతుఁడు వారివైపుజూచి యిటులఁ బలికెను.

సుకృత:—శోచనీయచరితులారా! నేను శపించిన రీతిని మీ రీజంబూద్వీపమును విడచి, యవనద్వీపమున తెల్ల గ్రద్దలై, పుట్టెదరు. కాని మీ రెపుడు పరులఁబ్రోచుటకై సంతోషముతో మీ దేహముల సమర్పింతురో, అపుడు మీరు తిరుగ నీయార్యావర్తమున మానవజన్మము నెత్తుదురు. మఱియు మీరు గృధ్రములై పుట్టినను పూర్వజన్మజ్ఞానము కలవారుగా నుందురు. అని, అనుగ్రహించెను.

మీనాక్షి:—నందనులారా! తపోనిధులగు మీజనకు లు మీకిచ్చినశాప మనుభవింప వలసినదేకాని దానిబారినుండి తప్పించుకొనుటకు వలనుగాదు "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం" అని యుండుటచే మానవుఁడు తాఁజేసిన మంచిచెడ్డల ఫలము ననుభవించియే తీరును. మీరిప్పటివ లెనే ఖగజన్మమునఁ గూడ దేహాభిమానులై, చావునకు వెఱచి, పరసంరక్షణమునకై నిజదేహముల నియ్యఁజాలమనక, అట్టి పుణ్యమబ్బినవెంటనే సంతసముతో దేహముల సమర్పించి, ముక్తులుకండు. అని బోధించెను. అప్పటికి పగలు పదకొండు గడియల ప్రొద్దెక్కెను. వెంటనే సుకృతుఁడు వైశ్వదేవమునకు సమయమగుటచే, భార్యతో హోమాగారమునకు వెడలిపో

మెను. ద్విజకుమారుఁడును నిజదౌష్ట్యములను నిందించుకొనుచు, పరులకై తమదేహముల నర్పించు సమయమునకు భగవంతుఁడు వేగముగ సమకూర్చుఁగావుత యని తలఁచుచు వెడలి పోయిరి.

సురపతి శ్రీగిరినుండి యమరపురికేఁగి, యాశ్చర్యజనకమగు, నాసుకృతుని త్యాగగరిమను నిజకాంతకుఁ దెలిపెను. శచీదేవియు, మీనాక్షీ సుకృతుల పావనోపాఖ్యానమునువిని, యబ్బురమంది, యీకుటిల కలికాలమున నట్టిత్యాగశీలురగు, మానవదంపతులుందురా? అని సంశయమంది, స్వయముగా నాద్విజదంపతుల త్యాగకళను, బరీక్షింపఁగోరి, నిజపతియనుమతిని వృద్ధబ్రాహ్మణీవేషమును దాల్చి, యమరపురమునుండి శ్రీగిరికి దిగివచ్చి, సుకృతుని మునిఁగిలివాకిలికడ నిలచి "ఓదయామయా! సుకృతాభిధేయా!" అని కేకవేసి, యలసినదానివలె, నేలపైఁబడి యుండెను.

ఆవేల్పుఱేనిరాణిమొఱ నింటిలో వంటచేయుచున్న మీనాక్షిచెవి సోకఁగనే, యడుగులు తడఁబడ నాలుకతడియార గడపకడ కెటులనో వచ్చి చూచుసరికి, వాకిట పుడమిపైఁ బడియున్న ముసలిబాపనమ్మ కానవచ్చెను.

తోడనే యాసుకృతుని యర్థాంగి యామెకడకేఁగి, నేలపై నొఱగియున్న, యాముత్తయిదువును దానొక్కతె లేవనెత్తఁజాలక "అమ్మా! రుక్మిణీ." అని బిగ్గఱగాఁ బిలచెను.

ఆపిలుపు విన్నతోడనే లోపలఁ జపముఁ జేసికొనుచున్న రుక్మిణి పరుగుపరుగునఁ, దల్లికడకు వచ్చి, "అమ్మా! యీయవ్వ యెవ్వతె? ఇట్లేల పడియున్నది?" అన మీనాక్షి యిట్లు తెలిపెను. "పుత్త్రీ! ముందీపెవృత్తాంతమును దెలిసికొందము. ప్రస్తుత మీయిల్లాలిని లోనికి గొంపోయి, మంచముపైఁ బరుండఁబెట్టుదము. నీవు పాదములకడఁ బట్టుము. నేను తలమొద్దఁ బట్టెదను." అని తెలిపి, రుక్మిణి తనకు సహాయము సేయ మీనాక్షి మెల్లగా నా ముసలమ్మను, లోనికిఁ దోడ్కొని పోయి, మంచముపైఁ బరుండఁబెట్టి, యాబాపనమ్మ కాళ్ళు పట్టఁదొడంగెను. రుక్మిణి విసనకఱ్ఱను పట్టి వీవ నారంభించెను.

అంత కొంతవడి కాముసలమ్మ మెల్లఁగ గన్నులువిప్పి, వారివైపు చూచి, "అమ్మలారా! సుకృతునిగృహ మిదేనా?" అని ప్రశ్నించెను.

మీనాక్షి—అమ్మా! ఇదియే యాపుణ్యచరితుని మందిరము.

ముసలమ్మ—ఆపుణ్యాత్ముఁడు మీ కేమి కావలయును?

మీనాక్షి—వారు నాసౌభాగ్యదైవతములు.

ముసలి—నీనాథుఁ డింటనుండెనా?

మీనా—లేరు. వా రీయగ్రహారమున నొకవిప్రవరుఁడు చేయుచున్న యాగమున, నాధ్వర్యము నెఱప నేఁగియున్నారు. తల్లీ! నీకు సంప్రాప్తమైన యాపద యేది?

ముస—అమ్మా! చెప్పి యేమిప్రయోజనము? ఇట నార్చేవారుగాని, తీర్చేవారుగాని, యెవరున్నారు?

విూనా—మాతరో! నా శక్తికొలఁది నీ దుఃఖమును బాపఁబ్రయత్నింతును. కావున, సందేహింపక తెలుపుము.

ముస—సతీమణి! అట్లైన వినుము నాదీనోపాఖ్యానమును.

నేనును, నాభర్తయు, మధురాపురమునుండి, త్రివేణీస్నాన మొనర్పఁ గాలినడకను, ప్రయాగకుఁ బోవుచు నిన్న సాయంకాలమునకు నిటకు నాల్గుక్రోశముల దూరమునన్నున్న యొక జీర్ణదేవాలయముకడకు వచ్చుసరికి, సూర్యాస్తమయ మాయెను. మేము దూరమునుండి నడచివచ్చినవార మగుటచేతను, వృద్ధులమగుటచేతను, ముందునకుఁబోనేరక యాదేవాలయ మంటపమునఁ బరుంటిమి.

రాతిరి నడిజామున నే మేల్కాని చూచుసరికి నా నాథుఁడు కానరాడయ్యెను. నే నతిభీతనై "నాథా! నాథా!" యని బిగ్గరగఁ బిలువఁదొడఁగితిని. కాని, నాకుఁ బ్రతివచనము వినరాదయ్యెను. నేను నాప్రాణేశునకై దేవాలయప్రాకారము చుట్టు తిరుగుచు, నటునటు నెలుఁగెత్తి నావల్లభుని, పిలచి పిలచి విలపింపఁ దొడఁగితిని.

అప్పు డాగోపురమునకు దక్షిణదిశనున్న రావిచెట్టు నుండి యొక కరాళవదనయగు, కాళి దిగివచ్చి "ఓద్విజపత్నీ!

వృథాగా నేలవిలపించెదవు. నీపతి నాచే నపహృతుఁడై నాఁడు. నిజముగా నీకు నీనాథుఁడు కావలసియున్నచో, నీతనికి బదులు వేఱొక విప్రుని నాకు సమర్పింపుము. అపుడు నీకు, నీమగని నొసంగుదును.'' అన నామాటకు నే బెదరి, చెదరిన హృదయ ముఁ జిక్కఁబట్టి యి ట్లంటిని.

"అమ్మా! "నాపతికై మీప్రాణములఁ ద్యాగము సేయు" డని నేఁ గోరినంతమాత్రాన నాయభీష్టము తీర్చువారు నాకెక్కడ లభింతురు? కావున, తల్లీ! నీవే నాపతిని సంరక్షింపుము." అని వినమ్రమమాళినై యాకాళిని ప్రార్థించితిని.

అంత నామహాశక్తి "సతీమణీ! ఇటకు నాల్గుకోసుల దూరమున శ్రీగిరియను విప్రాగ్రహార మొకటి కలదు. అందు సుకృతుఁడను ద్విజవరుఁ డున్నాఁడు. ఆతఁడు నీయభీష్టము నెఱవేర్పఁగలఁడు. కావున నీ వటకేఁగి, యాబ్రాహ్మణునిఁ బ్రార్థింపుము. అట్లు సేయకున్న నీవు నీపతికి నీళ్ళు వదలవలసినదే. వేరు దారి లేదు." అని అంతర్ధానమాయెను.

వెంటనే నేను చీఁకటి యని తలంపక, ముండ్లడొంకలను, రాలగుట్టలను దొక్కుకొనుచు, నెటు లెటులనో మీ వాకిటకు వచ్చితిని. చూడు మమ్మా! నాపాదము లెట్లు బొబ్బ లెక్కి యున్నవియో!" అని యాపె పాదతలములఁ జూపెను. మీనాక్షి ఆవృద్ధురాలి కాలిగాయములఁ గాంచి, దేహము కంపింప "తల్లిరో! ఎంతబాధ పడితివి! ఆహా! పతిసంరక్ష

ణమునకు సతులెంతటి దుఃఖములనైన సహింతురు కదా !"
అని రుక్మిణినిఁ బిలచి, కొబ్బెరనూనెను తెప్పించి, గాయము
లకుఁ బూయఁ దొడఁగెను. ఆయుపచారచాతురినిఁ జూచి,
యాకపటవేషధారిణి యగు నింద్రాణి లో వింతచెంది, యిట్లు
పలికెను.

ముసలి—ఓ యార్త్రావనపారీణా ! ఈ శారీరకబాధల
నివారింప నంతగా శ్రమపడవలదు. ఇవి నన్ను బీడించుట లేదు.
నీవు నాకుఁ బతిభిక్షము పెట్టి, నాకు రానున్న దుస్సహ
వైధవ్యవ్యథను దొలగింపఁ బ్రయత్నింపుము. సతులకుఁ బతి
వియోగదుఃఖములు దుర్భరములు. కావున నీపతిని నాకుఁ
బ్రత్యక్షము సేయుము. నేను పతితపావనములగు నావిప్రోత్త
ముని పాదములపైఁ బడి, "నాయాపద దీర్పుఁ" డని ప్రార్థింతును.
" అబ్బా ! హృదయ మదిరిపోవుచున్నది. " అని కన్ను
లు మూసి, మూర్ఛ నభినయింపఁ దొడంగెను.

అపుడు రత్నాకర తరంగము లోకవైపు నుండియు,
మహాహ్లాదధి భంగము లోక తట్టునుండియు, వారధనివలె,
నాయిల్లాలి యాపదను వినుటచేఁగలిగిన విచార మొక వైపు
నుండియు, నాపె కోరిక నాలించుటచే జనించిన పరితాపమొక
ప్రక్కనుండియు తన మానసమును జుట్టుముట్ట వ్యాకులితయై
మీనాక్షి యిట్లు తలపోసెను.

కట్టా ! నేఁడెట్టి దుర్దినము ! ఈనాఁటితో నానాథుని
ప్రేమామోదరమ్యమగు ముఖకమలమును జూచు భాగ్యము

సమాప్త మగునని తోఁచుచున్నది. ఈయాత్రురాలి దీనవార్త చెవి సోకినతోడనే నాప్రాణేశ్వరుఁడు కాళికి, దన జీవితము నొసంగి, యీమె నాథుని జీవింపఁజేయుట నిక్కువము. సూర్య చంద్రాదు లైన గతులు తప్పినను. కాని, నాపతి యార్తావన వ్రతమును దప్పఁడు. ఏమిచేయుదాన! ఎట్లు పతివియోగమును భరించుదాన!

ఈవార్తను నాప్రేణేశున కెఱింగింపకుండుట పాడికాదు. నామనోవల్లభుఁడు "దుఃఖితు లెవ్వరైనను మనయింటికి వచ్చి నయెడల వెంటనె కబురంపుము." అని శాసించియున్నవాఁడు. సుకృతార్ధాంగినగు నే నిట్లు విచారింపఁదగదు. "శక్తికొలఁది నీయాపదఁ దీర్పఁ బ్రయత్నింతును." అని యభయ మొసంగి యుంటిని. కావున, నావిభున కీబ్రాహ్మణిరాక నెఱింగింపక తప్పదు. ఆనాఁటి దేవత మీనాఁడు లేకుండునా! అని నిశ్చ యించుకొని, రుక్మిణినిఁ బిలచి "ఈసంగతిని నీజనకునకుఁ దెలిపి రమ్ము." అని నియమించెను.

రుక్మిణియుఁ, దల్లియాజ్ఞానుసారము యజ్ఞవాటికలోని కేఁగి, మాధ్యందినసవనసమయమునఁ గనులుమూసి, అంజలి ఘటియించి, స్తోత్ర పఠించుచున్న శత్రుముల కానందమును వెల్లడించుచున్న సుకృతునికి ఆ యాత్రురాలిరాక నెఱింగించె ను. ఆవార్త వినినతోడనే శరాసనమునుండి వెడలిన బాణము వలె, ఆబ్రాహ్మణుఁడు దర్భాసనమునుండి లేచి, యొక్కపరు గునఁ దనయిల్లు చేరెను.

మీనాక్షి పతి రా వెంటనే నమస్కరించి, యామూర్ఛి తను జూపి, యాపె చరితమును సవిస్తరముగా నివేదించి, "ఓసతీమణీ! ఇదిగో నామానస సారసభాస్కరులు వచ్చియున్నారు. కనుము"అన నాకపటద్విజకాంత కనులు తెఱచి, సుకృతునిఁ గాంచి, "త్యాగభాసురా! భూసురా! ఈదీనురాలిం గాపాడుము." అని తిరుగఁ గన్నులు మూసికొనెను.

సుకృతుఁ డాపెవార్తను, నిజసతీముఖమున విన్నవాఁడగుటచే వెంటనే సేవకులచే నొక సవారిని, దెప్పించి, అందావృద్ధాంగనను బరుండఁబెట్టి, పల్లకితలుపులఁ బట్టుకొని కుడి యెడమల దానును, తనసతియుఁ బరువిడ నతివేగముగా, నా విప్రకాంత తెలిపినగుడికడకు వచ్చి, పల్లకీనిఁ గ్రింద దింపించి "అమ్మా! ఆలయముకడకు వచ్చితిమి లెమ్మ."అని తెలిపెను.

ఆమాటలు విని, ఆమోసపుబాపనమ్మ సవారీలో నుండి మెల్లఁగఁ బైకివచ్చి, వారిని వెంట నిడికొని, రావిచెట్టు కడ కేఁగి " ఓ! కాళికాదేవీ! ఇడిగో నాప్రాణనాథుని రక్షింప సుకృతుఁడు వచ్చియున్నవాఁడు. ఈపూతచరితునిఁ జేకొని, నా పతినిఁ బ్రసాదింపుము." అని పలికెను. తోడనే ఆరావి చెట్టునుండి భయంకరరూపముతోఁ గాళి ప్రత్యక్షమై యిట్లు పలికెను.

కాళి—ఓపుడమిఱేఁడా! ఇపుడు నీప్రాణముల నా కొసంగి, యీ యిల్లాలివల్లభుని బ్రతికింపఁదలంచితివా?

సుకృతుఁడు—అమ్మా! సరస్వతిలయస్వరూపిణీ! ఈపెభర్త ప్రాణములఁ గాపాడ నాయసువుల సమర్పించి, నీలో లీనముకాఁదలంచితిని. తల్లీ! జాగుసేయక నాజీవితమును జేకొని, యీ యార్తురాలి నానందకలాకలితనుఁగా జేయఁ బ్రార్థించుచున్నాను.

కాళి—విప్రవరా! నీయర్ధాంగి కూడ నిందు కంగీకరించునా? లేక విలపించునా?

మీనాక్షి—అమ్మా! త్రిలోకజననీ! నే నెంతమాత్రము విలపింపను. కాని కొంచెము నాపరితాపమును విన్నవించుకొందును కావున మన్నించి యాలింపుము.

ఓ దీనజనావనకలాకలితా! లలితా! నీ కార్యకాంతలు పతివియోగముచే నెట్లు కుందుదురో తెలియదా? నీవు శంకరవియోగానలకీలలచే నెట్లు పరితపించితివో మఱచితివా? ఓకుంకుమతిలకవిలాసినీ! శివమానసమోహినీ! భారతసతీమణుల లలాటతటములు సౌభాగ్యతిలకవిరహితములు కానుండుటను గన్నులారఁ బరికించుచు, నిట్లు నిర్దయహృదయవైయుండుట నీకు న్యాయమా? ఓకృపాణపాణి! సదాశివునిరాణి! నీకరుణావలోకనామృతప్రసారము లేకున్న నబలలగు భారతాంగనలు మృత్యుముఖమునుండి తమ పతులఁ గాపాడఁ జాలుదురా? కావునఁ గావుము మా యైదువతనమును.

అట్లుసేయ ననుగ్రహింపవా? అయితే! ముందీభూసురరసాలము నల్లికొనియున్న నాదేహవల్లిని నీపావనకృపాణ

ధారచే ఛేదించి, నాకంట వైధవ్యపిశాచము పడకుండఁ జేసి, యావెంటనే పాప మీదీనురాలి మాంగల్యమును గాపాడుము. అని సాష్టాంగముగాఁ గాళీపాదములపై నొఱగెను.

అంత నాశచీదేవి యాసుకృతకాంతసాహసమునకు విం తఁ జెంది నిలువ నాకసమునుండి సురలు దివ్యసుమవర్షముల వారిపైఁ గురిపించిరి. ఆశీతలసురభిసుమసేచనమున కచ్చెరువంది మీనాక్షి కనులు తెరచి చూచుసరికి, శచీపురందరులు ప్రత్యక్ష మయిరి.

అపుడు, మీనాక్షీసుకృతు, లాయమరదంపతులకుఁ బ్రదక్షిణవందనము లొనర్ప, నాదేవదంపతు, లీమానవ జాయా పతుల దీవించి, వారి యనుపమానత్యాగగరిమను గొనియాడి నిజవిమానముపై వారినిఁ గూర్చుండఁబెట్టుకొని, శ్రీగిరికిఁ గొని వచ్చి వారియింట విడచి, యదృశ్యులైరి.

మీనాక్షీసుకృతు లాదృశ్యమును స్మరించుచు, దురితా భయప్రదాత్రియగు గాయత్రిని ధ్యానించుచు సుఖముగాఁగాల ము గడుపఁదొడంగిరి.

శ్లో॥ ఆధివ్యాధిహరన్నౄణాం మృత్యుదారిద్ర్యనాశనం।
శ్రీపుష్టికీర్తిదం వందే విప్రశ్రీపాదపంకజం॥

ఓం తత్సత్.

